# ఇళ్ళూ-గుళ్ళూ

వేమరాజు భానుమూర్తి

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

# ఇళ్ళు - గుళ్ళు

'ఇల్లు కట్టి చూడు, పెళ్ళి చేసి చూడు' అనీ, 'ఇల్లు చూచి ఇల్లాలిని చూడు' అనీ తెలుగుదేశంలో ప్రసిద్ధంగా రెండు సామెతలు ఉన్నాయి. వీటినిబట్టి చూస్తే ఇంటికీ ఇల్లాలికీ అవినాభావ సంబంధం ఉందనీ, ఇల్లు అనేది ఇల్లాలి కోసమే ఉద్దేశించబడిందనీ అనిపిస్తుంది. కాని ఇల్లు అన్నది ఇంటిలో ఉన్న అందరికోసమూ. ఈ ఇళ్ళు అనేకరకాలు. దేశ కాలాలను బట్టి, ఆయా జాతుల ఆచార వ్యవహారాలనుబట్టి, ఆయా ప్రాంతాల నైసర్గిక శీతోష్ణాది వాతావరణ పరిస్థితులను బట్టి రకరకాలుగా ఉంటూ ఉన్నాయి. మనది ఉష్ణదేశం. అందుచేత మనకు గాలి బాగా వచ్చేఇళ్లూ, ఎప్పుడూ చల్లగావుండే ఇళ్లూ కావాలి. పైగా మైదానప్రాంతాలలో, పల్లపుభూములలో కట్టుకొనే ఇళ్ళ తీరు వేరు. పర్వతప్రాంతాలలో, పీఠభూములలో వర్షం విపరీతంగాపడే చిరపుంజి, మన్సారాం వంటి ప్రాంతాల్లో, భూకంపాలు హెచ్చుగా వస్తూఉండే అగ్నిపర్వతప్రాంత భూములలో, వరద తాకిడి ఎక్కువగా ఉండే భూములలో, ఎండలు మండిపోయే ఎడారులలో, ఎల్లప్పుడూ గడ్డకట్టుకొని ఉండే మంచు టండ్రాలలో ఉండే ఇళ్ళు వేరువేరుగా ఉంటాయి. అవడానికి అవి ఇళ్ళే అయినప్పటికీ, ఒకదానికీ ఇంకొకదానికీ ఎక్కడా పోలికే ఉండదు. రారాజులు నివసించే రమ్యహర్మ్యాలతీరు వేరు; నిరుపేదలు నివసించే పూరిగుడిసెల పద్ధతి

వేరు. తరవాత సామాన్యులు నివసించే సౌధాలతరహా వేరు. ఏమయినప్పటికీ ప్రపంచంలో కనబడే వైవిధ్యంలో అనుస్యూతంగా ఉండే ఏకత్వానికి మంచి నిదర్శనం ఇల్లు. దీనికి పేర్లు అనేకం. పక్షులు కట్టుకునే ఇళ్ళని గూళ్ళనీ, దేవతల కోసం కట్టే ఇళ్ళని గుళ్ళనీ అంటారు. మానవులు నివసించే ఇంటినే వ్యంగ్యంగా గూడు అని వ్యవహరించడంకూడా కద్దు. కనుకనే 'ఎవరిగూడు వారిది, ఎవడివత్తి వాడిది' అనే నానుడి బయలుదేరింది. 'గువ్వ గూడెక్కె, రాజు మేడెక్కె' అనేది బాగా ప్రచారంలో ఉన్న మరొక మంచిసామెత. మన శిల్పంలో, సాహిత్యంలో లలితకళలలో గుడికీ గూటికీ చాలా ప్రమేయం ఉంది.

ఇళ్ళు, గుళ్ళు రకరకాలుగా ఉంటాయని చెప్పాను. ఇందులో కొన్నింటిసంగతి వింటే మనకు యెంతో ఆశ్చర్యం కలుగుతుంది. మంచుతో ఇల్లుకట్టుకుంటారంటే కరిగిపోకుండా ఎంతసేపు ఉంటుందని వెంటనే సందేహం వస్తుంది. కాని ధ్రువప్రాంతాలలో నివసించే ఎస్కిమోలనబడే ఒక జాతి వారు మంచు ఇటికలు పేర్చికట్టుకున్న చుట్టుఇళ్ళలో నివసిస్తున్నారు కాగితంతో ఇల్లు కట్టుకుంటారంటే వెంటనే 'నిజమా గాలికి ఎగిరిపోదా?' అనిపిస్తుంది. నిజమే; అలాంటి ప్రజలూ ఉన్నారు జపానుదేశంలో. అనేక వందలసంవత్సరాల నుంచి ఆ దేశపు ప్రజలు అల్లాంటి ఇళ్ళలో నిక్షేపంగా నివసిస్తున్నారు. వాళ్ళప్రాణానికి ఆ ఇళ్లు ఎంతో హాయిగా ఉన్నాయికూడా. ఇళ్ళను ఒకచోటినుంచి మరొక చోటికి మోసుకుపోయే ప్రజలున్నారంటే ఎవరు వాళ్ళు? అని తక్ష

ణమే అడగబుద్ధివేస్తుంది. లేకేం? అలాంటివాళ్ళూ ఉన్నారు. చెంచులు, లంబాడీలు వగైరా దేశదిమ్మరిజాతులు ఉండేది ఇలాంటి ఇళ్ళల్లోనే. వీరిలో కొంతమందికి ఒళ్లే ఇళ్ళు.

మనం అందరం ఈ దేశంలో నివసిస్తున్న ఇళ్ళతో పోల్చి చూచినప్పుడు చిత్ర విచిత్రంగా ఉండే ఇళ్ళు కొన్ని ఉన్నాయి అవి మనకు చిత్ర విచిత్రంగా ఉన్నట్లుంటాయి. కాని, ఎల్లకాలం అందులో నివసించేవారికి మామూలుగా నే ఉంటాయి. నిజానికి వాళ్ళందరికీ మన ఇళ్ళు ఎంతో విచిత్రంగా కనిపిస్తాయి కూడాను.

ఇల్లు పైకిచూడడానికి ఎలా ఉంటేనేం గాక. ఎండకీ, వానకీ, గాలికీ, మంచుకీ బాధపడకుండా కాస్తంత ఆశ్రయ మివ్వడమే దాని పరమప్రయోజనం' అన్నం వండుకుని, తిని, స్నానపానాదులు, జపతపాలు సాగించుకుంటూ, శీతవా తాతప బాధలు లేకుండా సుఖంగా సంసారం సాగించుకోడా నికి అనువైనది ఇల్లు.

ఇల్లుకట్టుకోవడం నిజంగా చాలా దుర్ఘటమైనకార్యం. మొదట్లో ఒకలా అనుకుని కట్టడం ప్రారంభిస్తే చివరకు ముగిసేసరికి ఇంకొకలా తయారై ఊరుకుంటుంది. అలాగే ఖర్చుల అంచనాలుకూడా తారుమారైపోతుంటాయి. పిండి కొద్దీరొట్టె అన్నట్లూ, విత్తంకొద్దీ వైభవం అన్నట్లూ కావల సిన కలప వగైరా సామగ్రి పుష్కలంగా లభించడంపైనే గృహనిర్మాణం అంతా ఆధారపడి ఉంటుంది. సర్వసాధార ణంగా ప్రతిదీ దూరంనుంచి మోసుకువచ్చి ఇల్లు కట్టుకోవడ మంటే ఖర్చు ఇబ్బడి ముబ్బడి అవుతుంది కనుక, సమీ

పంలో ఏమి దొరికితే అదే సద్వినియోగం చేసుకుంటూ దానినే ఉపయోగించి పక్కయిల్లు కట్టుకోడానికి ప్రతివారూ ప్రయత్నంచేస్తుంటారు. బండరాళ్ళు బాగా దొరికే కొండ ప్రాంతంలో గోడలన్నీ వాటితోనే తయారవుతాయి.

ఒండ్రు బాగా దొరికే మైదానప్రాంతములో అడుసుతో చేసిన పండుటిటుకలతో తయారవుతాయి; పూరి పుష్కలంగా లభించే చోట్ల మనకు చాలావరకు కనబడేవి పూరిళ్ళే.



చైనాలో ఆదివాసుల గుహలు

ఇళ్ళ చరిత్ర ఒకవిధంగా నాగరికపథంలో మానవజాతి అభ్యుదయచరిత్ర. ఆదిమమానవులు గరిక పుష్కలంగా దొరికే ప్రాంతాలలో ఉన్నప్పుడు గడ్డిఇళ్ళే కట్టుకున్నారు. కొండగుహలు సమీపంలో ఉన్నప్పుడు అవే వారికి ఆశ్రయాలయ్యాయి. అడవులలో ఉన్నప్పుడు చెట్లకలప, కొమ్మలు, ఆకులు, బెరళ్లు వారికి గృహనిర్మాణోపకరణలయ్యాయి. మనకు విచిత్రంగా కనబడే వస్తువులను వాడుకచేసి వారు

ఒక్కొక్క-సారి ఇళ్ళు కట్టుకోవలసివచ్చేది. బాగా తెలిసిన వస్తువులనే కొత్తపద్ధతిలో ఒక్కొక్క-సారి వాడుక చెయ్య వలసివచ్చేది. అయితే, ఇందుకు కారణం లేకపోలేదు. మాటవరసకి తమకూ,తమ పశువులకూ ఆహారం అన్వేషించుకుంటూ వందలకు వందల మైళ్ళు వలసవెళ్ళే జనానికి ఒక్క-చోట స్థిరంగా ఉండే మేడలూ, మిద్దెలూ కట్టుకుంటే బ్రతుకు ఎలా సాగుతుంది? అలాగే కడుపులో చల్ల కదలకుండా కాలుమీద కాలు వేసుకుని కూర్చొనే స్తోమతకల కోనసీమ ఖామందుకి ప్రతి గాలికీ ఊగిపోయే పూరిపాకల ప్రయోజనం ఏమిటి? ఎక్క-డా కలపఅంటూ కానరాని రాతినేలలో నివసించేవారు బండరాళ్ళతో ఇళ్ళు కట్టుకోక ఏంచేస్తారు? ఇంక కాశ్మీరువంటి దేశంలో పడవమీదే అన్ని సరుకులూ అమ్ముకుని బ్రతికేవారు వాటిమీదే ఉండక ఏంచేస్తారు?

ఇళ్ళనీ గుళ్ళనీ గురించి చెప్పేటప్పుడు ముందుగా మనకు విచిత్రంగా కనపడే ఇళ్ళసంగతి కాస్త చెప్తాను. ఆ తరువాత ఆదికాలంలో ఆదిమానవులు చెట్టునీడనే ఎలా తల దాచుకునేవారో, ఆ తరువాత తెలివితేటలు పెరిగి మానవులు మహాసౌధనిర్మాణంలో ఎలా ప్రవీణులయ్యారో ఆ పరిణామం అంతా కూడా చెప్పాలని ఆశిస్తున్నాను.

'ఇల్లు కట్టుకొని, పెళ్ళిచేసుకుని' పొలమూ పుట్రా చూచుకుంటూ హాయిగా కాలక్షేపంచేసే మనమాట ఎలా ఉన్నా, ముందుగా ఇల్లు,వాకిలి లేకుండా తట్టాబుట్టా భుజాన వేసుకుని ఎప్పటికప్పుడు ఆహారం వెదుకుకుంటూ దేశాలమ్మటపోయే దిమ్మరుల సంగతి చూడండి. వాళ్ళు ఎప్పటి

కప్పుడు తమకీ, తమ పశువులకీ ఆహారం వెదుక్కుంటూ ఉండాలి. ఒకచోట ఆహారానికి కొరత ఏర్పడితే, అక్కడి నుంచి జయ్ పరమేశ్వరా అంటూ జండాఎత్తి ఇంకో మజిలీకి పోవలసిఉంటుంది. ఇలాగ వీళ్ళబతుకంతా మజిలీల మయమే కావడంతో తట్టాబుట్టాతో సహా గంపెడు సంసారం కంటె ఎక్కువ ఉండడానికి వీలులేదు. సాధ్యమయినంత తేలికగా, సాధ్యమయినంత తక్కువ వ్యవధిలో మకాం మార్చివేయడానికి వీలుగా ఉండాలి. చలికాలంలో కాస్త సుఖోష్ణంగానూ, వేసవికాలంలో కాస్త సుఖశీతలంగానూ ఉండే తేలికపాటి వహనయోగ్యమయిన యిల్లు కావాలి వాళ్ళకి. ఇలాంటి దేశదిమ్మరిజాతులు ఏదేశంలో ఉన్నా పటకుటీరాలే వారికి రమ్యహర్మ్యాలు కాక తప్పదు. ఈపటకుటీరాలు కట్టడం అనేక విధాలు. వీటిని కట్టడానికి కావలసినదల్లా గృహశల్యాలుగా పనికివచ్చే ఆరు పొడుగాటి కర్రలు. వీటన్నిటిని ఒక చివర ఒక కట్టగాకట్టి ఈ ఆరుకర్రల్నీ ఆరువైపులకీ సర్ది నిలబెడతారు. ఈవిధంగా నిలబెట్టిన వాసాల ఆవరణచుట్టూ మృతకచర్మాన్నో, కాండపటాన్నో, లేకపోతే ఈరోజులలో అయితే గోనెపట్టానో చుట్టబెడతారు. పైని ఉన్న సన్నని ఖాళీలోనుంచి పొగఅంతా బయటికి పోవడమే కాకుండా వెలుతురు లోపలికి ప్రవేశిస్తుందికూడా. గట్టిగా గాలివస్తే ఎగిరిపోకుండా ఉండడంకోసం మరికొన్ని పట్టాలను లోపలివైపున దిట్టంగా వేలాడదీస్తారు. ఇలాంటి ఇళ్ళు కట్టడమూ తేలికే,తరలించుకుపోవడమూ తేలికే. ఈనాటికీ గాడిదలమీద గూడువేసుకుని తండాలు తండాలుగా తరలిపోతూ

ఉండే దేశదిమ్మరులు మనకు కనబడుతూనే ఉంటారు. ఈ దేశదిమ్మరులజాతికి చెందినవారే హిమాలయప్రాంతాలలో ఉండే టిబెటనులు మొదలయినవారు వీరు 'యాక్' అన బడే జడల బర్రెలను విరివిగా పెంచుతారు. వీళ్ళంతా తేలికగా మోసుకుని వెంట తీసుకుపోడానికి పనికివచ్చే 'యర్ట్' అనే ఒకరకం ఇళ్ళు నిర్మించుకుని నివసిస్తూ ఉంటారు. ఇవి ముఖ్యంగా అల్లిక తడకలతో కట్టి, ముతక ఉన్ని ఏకులు కప్పినఇళ్ళు. టిబెటు దేశంలో శీతాకాలం బహు దుర్భరంగా ఉంటుంది. చలికి గజగజలాడిపోవలసివస్తుంది. పైగా గాలి పాటుకూడా ఎక్కువే. అందుచేత ఎక్కడా ఏమూలనుంచీ కూడా పిసరంతఅయినా గాలి దూరకుండా ఒత్తుగా ఉన్నితో కప్పివేస్తారు. కనకనే ఈ ఇళ్ళు పొగచూరిపోయి ఉంటాయి.

'ఎడారి ప్రాంతాలలో నివసించే దేశదిమ్మరులు కట్టుకొనే ఇళ్ళు యింకొకరకానివి. వీరు కట్టుకునే ఇళ్ళుకూడా తేలికపాటివేకాని, ఇవి అడుగులా పల్చని బట్టలతో నిర్మింపబడతాయి. ఒక్కొక్కసారి యీ పైకప్పుబట్టను ఉన్నితో గాని, వేరొక బొచ్చుతోగాని నేస్తారు. ఇసుక ఎడారుల లాగానే మంచు ఎడారులుకూడా ఉన్నాయి. వీటిలో ఎస్కిమోలు నివసిస్తూఉంటారు. వీరు వేసవికాలములో ఉండడానికి కొయ్యతోను, రాళ్ళతోను, అడుసుతోను కట్టుకున్న శాశ్వత గృహాలు ఉంటాయి. కాని వీరు ఆహారాన్ని వెతుక్కుంటూ చాలాదూరం వెళ్ళవలసివస్తూ ఉంటుంది. కనుక అలాంటప్పుడు నివసించడంకోసం అక్కడ పుష్కలంగా



"మంచు ఇగ్లూ"

దొరికే మంచుతోనే ఇళ్ళు కట్టుకుంటారు. వీటికి 'ఇగ్లూలు' అంటారు. 'ఇగ్లూ' అంటే ఎస్కిమోలభాషలో 'ఇల్లు' అని అర్థం. ఇళ్ళుకట్టుకోడానికి అన్నిరకాల మంచూ పనికిరాదు. తమకు అందుబాటులోఉన్న మంచు ఇల్లు కట్టుకోడానికి పనికి వస్తుందో లేదో ముందుగా పరిశీలించి చూస్తారు. పరీక్షకి ఆగితే 'వాల్‌రస్' అనబడే సముద్రపు జంతువు ఎముకతో చేయబడిన కత్తితో ఈ మంచును ఇటికెలుగా కోస్తారు. ఈ కత్తినే ఎందుకు వాడతారంటే మంచు దీనికి అంటుకోదు కనక. ఈ కట్టడం కూడా గమ్మత్తుగా ఉంటుంది. ముందుగా మంచు ఇటికల్ని గుండ్రంగా పేరుస్తారు. తాము లోపల గిరిలో నిలబడి ఒక టాకతే ఇటికల్ని డిప్పలాగ అమరుస్తారు. ఆతరువాత తమదగ్గరఉన్న దంతపుకత్తితో గుమ్మంకోసి బయటికి పాకివస్తారు. ఇంక వెలుతురు ధారాళంగా రావడానికి మిలమిల మెరిసే మంచు



ఎస్కిమోల మంచు (ఇగ్లూ) ఇల్లు కట్టేపద్ధతి

ముక్కను తీసుకువచ్చి కిటికీలో అమరుస్తారు. ఈ విధంగా తయారైన మంచుఇంటిలో ఎస్కిమో కుటుంబం అంతా నివసిస్తుంది. లోపల ఆ మంచుతోనే ఎత్తుగా దిమ్మ వేసుకొని దానిమీద ఉన్నిదుప్పట్లు పరచుకొని, పైని ఇంకో నాలుగు కంబళ్ళు కప్పుకుంటారు. దాంతో అంత చలికాలంలో కూడా వీరికి ఒక్కొక్కప్పుడు ఉక్కపోస్తూ ఉంటుంది. ఇంక వంట అంతా రాతిపొయ్యిమీద 'సీలు' జంతువు కొవ్వును మండించి చేసుకుంటారు. లోపల కాస్త పొగచూరితే ఏంగాక; బయట వాతావరణం అంతా సున్నకి 80 డిగ్రీలు కిందికి దిగిపోయిన సమయంలో వాళ్ళప్రాణానికి ఆ మంచుఇల్లే మహా సౌధంలాగ వెచ్చగా ఉంటుంది. చలిదేశం కనక ఈ ఎస్కిమోలు మాంసమూ, కొవ్వూ హెచ్చుగా తినవలసివస్తుంది.

వారు సీలు జంతువుల్నీ, వాల్‌రస్ జంతువుల్నీ పంట్రకోలతో పట్టుకుంటూ ఉంటారు. గాలంవేసీ, వలలు పన్నీ చేపలు పట్టుకుంటారు. ఈ 'ఇగ్లూ' కప్పులో చిన్న చిల్లి కొట్టి, దాని అంచున కొంచెం ఎరపెట్టి పక్షుల్ని వేటాడుతూ ఉంటారు. పాపం, ఆ వెర్రిపక్షులు యెరకోసం వాలగానే అడుగున పొంచి వుండే వేటగాళ్ళు వాటిని కాళ్ళుపట్టుకొని లోపలికి యీడ్చేస్తారు. అలాకాకుండా పొడుగాటి గడకు వల కట్టి కూడా పక్షుల్ని పట్టుకుంటూ ఉంటారు. ఈ మంచు ఇంటిలోనే ఆహారాన్నీ ఆయుధాల్నీ అన్నింటినీ దాచుకుంటారు. ఎముకలూ, దంతం—వీటితో ఆటవస్తువులూ, అన్ని ఉపకరణాలూ తయారుచేసుకుంటారు. తోళ్ళను పదునుచేసి నీరు చొరకుండా వెచ్చగా వుండే దుస్తులు తయారుచేసుకుంటారు. మంచు తప్ప ఇంకేమీ కనబడని ఆ టండ్రాభూములలో చల్లగా ఉండే ఆ మంచునే ఉపయోగించి వెచ్చని స్థావరాలు నిర్మించుకొనే ఎస్కిమోల తెలివిని ఏమని పొగడాలి.

ఇంక ఇటలీ దేశంలోని ఇళ్ల విచిత్రాలను గురించి కొంచెం చెబుతాను. దక్షిణ ఇటలీలో ఎక్కడ చూచినా రాళ్ళమయంగా ఉండేప్రాంతం ఉంది. అక్కడ రైతులు—పాపం, పంటలు పండించుకోవడం కోసమని ఈ రాళ్ళనన్నింటిని చేలల్లోనించి ఏరివేస్తారు. ఈ రాళ్ళని ఎలా వినియోగించాలనేది వారికి పెద్ద సమస్య అయిపోయింది. అందుకని వాటినే ఒకదానిమీద ఒకటిగా పేర్చి ప్రతి చేనుచుటూ కంచె వేస్తారు. పైగా ఒక్కొక్కసారి చేనుమధ్య అరుగులాగ పేర్చిపెడతారు. వీట్లతోనే ఇళ్ళు కట్టుకుంటారు.

ఇళ్ళకప్పులకి వీటినే వాడతారు. ఇలాంటి ఇళ్ళు ఇటలీ లోనేకాదు, మన రాయలసీమలో కడప, కర్నూలు జిల్లాలలో కూడా కనబడతాయి. అక్కడ అన్నింటికీ నాపరాళ్ళే వాడతారు.



హోపీ ం నో ా ం లు

ఇటలీ రైతులు కట్టుకొనే ఇళ్ళను 'ట్రూలిస్' అంటారు. అంటే తేనెపట్టులాంటి దని అర్థం. ఇవి కూడా ఇంచుమించుగా ఎస్కిమోలు కట్టుకొనే మంచు యిళ్ళలాగానే గుండ్రంగా, గోళాకారంగా ఉండి పోను పోను కోసుగా ఉంటాయి. ఇక వీటి గోడలమందం కోటగోడ లంతేసి. ఎప్పుడూ కూడా ఏడడుగుల మందానికి తక్కువ ఉండదు. పైగా ఈ గోడ కట్టడానికి మనలాగ వాళ్ళు సిమెంటుగాని, మట్టిఅడుసుగాని ఉపయోగించరు. రాళ్ళన్నింటినీ ఒకదాని సరసన ఒకటి పేర్చి 'పొడి' గానే కడతారు. ఇవి పడిపోతాయనే బెంగలేదు. వీటికి గల మరొక విచిత్రలక్షణ మేమిటంటే వీటికి కిటికీలు ఉండవు. కిటికీలకు బదులుగా రాతిగో

డలో మధ్య మధ్య చిన్న చిన్న కంతలు వదిలిపెడతారు. ద్వారబంధాలూ, అవీ సన్నగా చిన్నగా ఉంటాయి. ఈ ఇళ్ళల్లో వచ్చిన చిక్కేమిటంటే వారంవారం విడవకుండా కష్టంతోసహా ఇల్లంతా దుమ్ము దులుపుకుంటూ ఉండాలి. అలా కాకుండా బద్ధకించినట్లయితే ఇంటికప్పు అంతా అన్నిరకాల మొక్కలతోటీ పచ్చని పందిరిలా అయిపో తుంది. గడ్డీ గాదం బాగా మొలిచిపోతుంది. దూరంనించి చూస్తే ఇవన్నీ అడవిలాగ అల్లుకుపోయినట్లు కనబడతాయి. ఈ యిళ్ళలోపల అంతా వట్టి చీకటి గుయ్యారంగా ఉంటుంది. ఇందుకు కారణం కిటికీలు లేకపోవడం— ఆ ఉన్నకంతలోనుంచి సూర్యకాంతి ఏడడుగుల లోతుకు దూసుకురావడం. ఆ గోరంతకాంతీ కొండంత ఇంటిని ప్రకా శవంతంచేసే నిమిత్తం లోపలిగోడలకి తెల్లంగా వెల్లవేస్తారు. ఈరాళ్ళనే ఒత్తుగా పరచుకొని, అరుగులుగా కట్టుకుని వాటి మీద పక్కలు పరచుకొని పడుకుంటారు. నేల అంతా పెద్ద పెద్దరాళ్ళుపరిచి తేమలేకుండా చేసుకుంటారు. కాళ్ళు జారి పోకుండా ఉండటానికి ఈ రాళ్ళమీద గడ్డిపరకలు పరుస్తారు. ఆఖరికి పశువులపాకల్నీ, కోళ్ళగూళ్ళనీ కూడా వీళ్ళు రాళ్ళతోనే కడతారు.

ఇల్లు అనగానే నేలమీద ఎత్తయిన ప్రదేశంలో నీళ్ళునిలవని మెరకల్లో కట్టుకుంటారని అనిపించడం సహజం. కాని చైనాలో, కాశ్మీరులో అనేక వేలమంది పడవలమీదే ఇళ్ళు కట్టుకుని అందులో కాలక్షేపముచేస్తూ ఉంటారు. వీళ్ళ బ్రతుకంతా ఈ నీటిమీదియిళ్ళలోనే గడిచిపోతుంది. వీళ్ళు

ఇలాగ నేలవిడిచి నివసించడం దేనికో చెప్పడం కష్టం. కాని చైనాలో నేలమీద నివసించేవారు ఎక్కువ పన్నులు చెల్లించుకోవాలి కనక వాటిని తప్పించుకోవడం కోసం అలాగ నీళ్ళమీద నివసించడం మొదలుపెట్టారట. వీరు నివసించే ఈ జలగృహం 20 అడుగుల పొడవు ఉంటుంది. ఆ పడవలో ప్రయాణీకులకోసం ఒకగది ఉంటుంది. కుటుంబంలో అంతా మాత్రం పడవ వెనకభాగంలో నివసిస్తూ ఉంటారు. అందులోనే ఒక పడకగదీ, ఒక వంటగదీ, భోజనాలగదీ, స్నానాదికాలకు యేర్పాట్లూ కూడా ఉంటాయి. చైనాలోనే కాంటన్ నగరంలో దాదాపు రెండు లక్షల ఏభై వేలమంది చైనావారు ఇలా నివసిస్తున్నారు. పచారీ దుకాణాలూ, హోటళ్ళూ, బజార్లూ, మందులదుకాణాలూ, నగల దుకాణాలూ, అన్నీ కూడా ఈ పడవలమీదే ఉంటాయి. ఈ పడవలన్నీ పక్కపక్కనే ఒకదానితో ఒకటి కలసిఉండడంచేత క్రలవంతెన కట్టినట్టుగా ఉంటే నీరు కనబడదు. ఈ పడవ ఇంటిలో నివసించే పిల్లలు నీళ్ళలో పడిపోకుండా ఉండడం కోసం తల్లులు వాళ్ళనడుములచుట్టూ తాడుకట్టి వదలివేస్తారు. కొంచెం వయసువచ్చిన పిల్లల నడుములకు వాళ్ళు ఒకవేళ కాలుజారి పడిపోయినప్పటికీ నీటిలోమునిగిపోకుండా తేల్చివేయగల సొరకాయ బుంగలు బిగిస్తారు.

అమెరికాలోనూ మరికొన్ని ఇతర దేశాలలోనూ, అన్నివిధాలా ఇల్లులాగే సర్వసౌఖ్యాలూ అమర్చిన పడవ యిళ్ళు ఉన్నాయి. మనదేశంలో దూరబోట్లూ, రాధారి పడవలూ ఈ కోవకు చెందినవే. ఈ యిళ్ళలో ఉండేవాళ్ళ

పిల్లలు శీతాకాలములో బడికి వెళ్ళి చదువుకొని వేసవికాలం సెలవుల్లో ఒకచోటినుంచి యింకొకచోటికి ఈ పడవల్లో ప్రయాణంచేస్తూవుంటారు.

గృహంకాని గృహం ఒకటి వుంది. అది దీపగృహం. ఇందులో మామూలు యిళ్ళలో మాదిరిగా జనం చాలా మంది ఉండరుకాని, స్వల్పసంఖ్యలో నివసిస్తూనే ఉంటారు. దీపగృహాలు సాధారణంగా సముద్రతీరంలో నిర్మింపబడతాయి. మరికొన్ని చిన్న చిన్న దీవులమీదా, నీళ్ళలో దాగివుండి పడవను ఢీకొనే ప్రమాదకరమయిన పర్వతాల మీదా నిర్మింబడుతూ ఉంటాయి. ఉప్పెన ఉవ్వెత్తుగావచ్చి దీపగృహం సరసన నిర్మింపబడిన నివాసగృహాలు కొట్టుకుపోయినప్పుడు, దీని తాలూకు సిబ్బంది అంతా ఆపత్కాలం గడుపుకోడానికి దీపగృహంలోనే నివసించవలసివస్తుంది. ఈ దీపగృహాలకీ మామూలు గృహాలకీ యింకొక తేడాకూడా ఉంది. దీపగృహాలు పైకి చూడడానికి గుండ్రంగా స్తంభాల లాగ ఉంటాయి. కనుక మామూలు ఇళ్ళలాగ వీటికి మూలలు ఉండవు. పైగా పాతకాలపు దీపగృహంలో నూనె దీపాలే ఈనాటికీ వాడుకలో ఉన్నాయి. కొత్తరకపు దీపగృహాలు వాసయోగ్యంగా నిర్మింపబడడమే కాకుండా పెట్రోలుతో నడిచే విద్యుదుత్పాదక యంత్రాలతో అమర్చబడి ఉంటాయి కూడా. అందువల్ల నూనెదీపాలగొడవ లేదు. ఇక్కడ ఆహారం దొరకక చాలా ఇబ్బందిపడవలసివస్తూ ఉంటుంది. ఉప్పుతోసహా అన్నీ బయటినుంచి రావలసిందే. పోతే పుష్కలంగా దొరికేవి చేపలుమాత్రం. వారాని కొక

సారి కుటుంబంఅంతా కదిలివెళ్ళి సంత చేసుకుంటారు. లేదా సంతపడవ వీళ్ళదగ్గరికే వస్తుంది. చుట్టాలూ, పక్కాలూ, స్నేహితులూ, సినిమా లంటూ ఏమీ లేకపోవడంచేత జీవితం మందకొడిగా సాగుతూవుంటుంది. అయితే ఈనాడు రేడియో, టెలివిజనూ, మంచి మంచి పుస్తకాలూ అందరికీ అందుబాటులోకి వస్తున్నాయి. కనక ఆహారపదార్థాలు పుష్కలంగా నిలవచేసుకుని, ప్రేయసిని సరసను కూర్చోబెట్టుకొని ద్వీపాంతరాలలోని దీపగృహనివాసశిక్షను సైతం మధునిష్యంది మనోజ్ఞవసంతంగా గడిపివేయవచ్చు.

కాగితాలయింటిలో కాపరంచేయడం ఎలాగ అని మనకు సందేహం రావచ్చు. పేదరాశి పెద్దమ్మ కథలలో రాజకుమారు డెవడైనా కాగితంలో ఇల్లు కట్టి అందులో కాపరంచేయగల కాంతామణినే కన్నులకద్దుకొని కల్యాణం చేసుకోగలనని కాలికిబలపంకట్టుకొని తిరగవచ్చుగాక. కాని ఈ ప్రపంచంలో కాగితపుఇళ్ళు ఉన్నాయి; వాటినిఅందంగా అలంకరించుకొని సుఖంగా కాపరంచేస్తూ ఉన్న కాంతామణులూ ఉన్నారు.

అనుమానం ఉన్నవాళ్ళెవరయినా ఆధునిక జపాను దేశాన్ని సందర్శిస్తేసరి ఆ అనుమానం తీరిపోతుంది. జపానువారికి కాగితపుఇళ్ళే ఎందుకు శరణ్యమయ్యాయి అంటే, ఆ దేశమంతా అగ్నిపర్వతాలపుట్ట. అందుచేత భూకంపాలతాకిడి ఎక్కువ. 'బరువయిన ఇళ్ళు కట్టుకుంటే భూమికంపించినప్పుడల్లా అవి మీదపడి వాళ్ళప్రాణాలకే మోసంతీసుకురావచ్చు. అందుచేత కాగితంతో కట్టుకున్న

కర్రయిళ్ళయితే అంత ప్రమాదంలేకుండా బయటపడవచ్చు. అయితే ఈ యిళ్ళనిర్మాణంకోసం ఉపయోగించే కాగితం మనం మామూలుగా రాసుకునే కాగితంలాగ పల్చగా ఉండదు. అది దిట్టంగా, నీరు చొరనిదిగా ఉంటుంది. ఇంక ఇల్లంతా ముందుగా కొయ్యచట్రంరూపంలో తయారుచేసు కొని ఆ చట్రంలో ఈ అట్టలు బిగిస్తారు. పైకప్పంతా పూరితోనో, ఆకులతోనో లేకపోతే పల్చని పెంకులతోనో నేస్తారు. ఈ కప్పుల్ని నాలుగుమూలలా మరమేకులతో బిగి స్తారు. పైగా దెయ్యాలూ అవీ కర్మంచాలక ఇంట్లో ప్రవే శిస్తే అవి వెంటనే బయటికి పారిపోడానికివీలుగా ఇంటి కప్పు నాలుగుకొనలూ తెంచుకొని ఉండేటట్టు పైకి మడుస్తారు. చీనావాళ్ళయిళ్ళకప్పులుకూడా ఇలాగే ఉంటాయి. జపానీల యిళ్ళల్లో కాగితంగోడల్ని ఇష్టంవచ్చినట్టు కదుపుకొని అవ సరాన్నిబట్టి గదివైశాల్యాన్ని పెంచడమో, కుదించడమో, చేయవచ్చు. లేదా చిన్నచిన్న అరలుగా మార్చివేయవచ్చు. అంతటినీ ఒకేహాలుగా తీర్చిదిద్దవచ్చు. నేలఅంతా చాపలతో అలంకరించి ఉంచుతారు. ఇంటిలో ఉన్నప్పుడు ఎవళ్ళూ చెప్పులు తొడుక్కోరు. కనుక వచ్చినవాళ్లుసైతం వాకిటిలోనే చెప్పులు వదిలిపెట్టాలి. జపానీలు నేలమీదకూర్చొని ముం దొక బల్ల పెట్టుకొని పింగాణీచిప్పలలో వడ్డించిన ఆహారాన్ని వెదురు పుల్లలతో నోటిలోకి ఎగరవేసుకుతింటారు. ఇంటిలో అంతా మెత్తని బొంతలు పరుచుకొని పడుకుంటారు. తల గడకుబదులుగా చిన్న కొయ్యదుంగ తలక్రిందపెట్టుకుంటారు. ఇంక స్నానపానాలకి అన్నిటికీ వాడేవి కొయ్యతొట్టెలు.

వేణ్ణీళ్ళస్నానం అంటే వీళ్ళకిష్టంకదా. ఇళ్ళల్లో స్నానాల సదుపాయం లేనివాళ్ళు చాలా చవకగా మందికోసం కట్టిన స్నాన గృహాలు ఉపయోగించుకుంటూ ఉంటారు. ఈ కాగితం ఇంటికి వెనకాలఉన్న కాస్త పెరట్లోనూ జపానువారు అందంగా ఒక చిన్న తోట వేసుకుంటారు. అందులోనే ఒక కొలను. ఆ ప్రక్కనే చిన్న సేతువు, ఒకటి రెండు దీప స్తంభాలూ, ఆ దొడ్లో ఏమన్నా పురాతనవృక్షాలు ఉంటే వాటి మధ్య ఆహ్లాదకరమైన లతావితానాలూ అందంగా ఏర్పాటు చేసుకుంటారు.

ఇళ్ళల్లో అనేక రకాలు ఉన్నాయి. చెట్లమీది ఇళ్లు, నేల మీది యిళ్ళు, కొండశిఖరాలమీది యిళ్ళు, మంచె యిళ్ళు, నీళ్ళమీది యిళ్ళు ఉన్నాయి. సంచారగృహాలసంగతి కూడా కొంచెం చూద్దాం. పూర్వకాలంలో భారతదేశం నుంచి ఒక విచిత్రమయిన తెగకు చెందిన జనులు ప్రపంచం అంతా వ్యాపించారు. వాళ్ళని ఇప్పుడు మనం దేశదిమ్మరులు అంటున్నాం. వాళ్ళు ఉల్లాసంగా ఉండే సంగీతప్రియులయిన వాళ్ళు. ఎప్పుడూ ఒకచోట కట్టకట్టుకు ఉండడంకంటే సదా సంచారంచేస్తూ ఉండడమే వాళ్ళకి ఎక్కువ ఇష్టం. వీరంతా గుంపులు గుంపులుగా నివసిస్తూ ఇళ్ళదిమారిగా ఉపయోగ వడే గూడు ఇళ్ళలో నివసిస్తూ ఒకచోటునుంచి మరొకచోటికి పిల్లా మేకాతో సహా తండాలు తండాలుగా కదిలిపోతూ ఉంటారు. ఈ గుంపులవాళ్ళు తాము వెళ్ళినచోటల్లా స్థానిక రైతులకు వ్యవసాయపు పనులలో సాయంచేసి కూలి సంపాదించుకుంటారు. ఆ పని అయిపోగానే అక్కడినుంచి జంప్

పరమేశ్వరా అని మరొక ఊరికి మకాం ఎత్తివేస్తారు. ఇలాంటివారే కాకుండా కొంతమంది సంపన్నులు ఈనాడు ఇంటిలోవలె అన్ని హంగులూ అమర్చబడిన మోటారుకారు లెక్కి పర్యటనచేస్తున్నారు. సంచారగృహాలలో నివసించ డానికి ఎవరికితగ్గ కారణాలు వారికి ఉన్నాయి.

ఇలాంటివాటిని వాడుకచేయడం వల్ల దేశాటన సందర్భంలో హోటలు బిల్లులు కలిసివస్తాయని కొందరూ, ఆరోగ్య రక్షణనిమిత్తం గాలిమార్పుకోసం అనికొందరూ, పెద్ద పెద్ద ఫాక్టరీల సమీపంలో ఉండడానికి ఇళ్ళు దొరకకపోవడం చేత సంచారగృహాలను కొనుక్కొనేవారు కొందరు. ఈసంచార గృహాలు అల్యూమినియంతో తేలికగా, గట్టిగా నిర్మించ బడతాయి. లోపల మంచాలూ, పరుపులూ అక్కర లేనప్పుడు గోడకు మడిచివేయడానికి వీలుగా ఉంటాయి. వంట పొయ్యిలు సీసాలలో భద్రపరచబడిన వాయువు సహాయంతో మండుతాయి. స్నానాల గదులలో నీటితుంపర యంత్రాలు అమర్చబడి ఉంటాయి. ఆహార పదార్థాలు నిలవచేయడానికి హిమయంత్రాలు ఉంటాయి. మంది ఎక్కువయితే అప్పుడప్పుడు కొంచెం ఇరుకు అనిపిస్తుందికాని, లేకపోతే ఈ సంచారగృహాలంత సుఖమయినది మరొకటి లేదు.

ఈ విచిత్రమయిన ఇళ్ళన్నింటిలోను ఇటీవలిది 'కోన్‌సెట్ హట్' అనబడే లోహకుటీరం. ఇది పూర్తిగా ద్వితీయ ప్రపంచ మహాయుద్ధావసరాలకు నిర్మించబడింది. అతి స్వల్పకాలంలో, తక్కువఖర్చుతో ఎక్కువకాలం మనే

యిళ్ళను ఎక్కడికక్కడ నిర్మించుకునే అవసరం యుద్ధ కాలంలో చాలా కలిగింది.

ఫలితంగా ఈ లోహకుటీరాలు చాలా వెలిశాయి. యుద్ధం ముగిసినతరువాత అనేకవందలమంది వీటిని కొని అందులో కాపరంచేయడం మొదలుపెట్టారు. ఈవిధంగా ప్రపంచంలో మనకు ప్రతిచోటా కనబడే అసాధారణ గృహాలు ఆయా ప్రత్యేక పరిస్థితులకు అనుగుణంగా నిర్మింపబడ్డాయన్న సంగతి తెలుస్తుంది. భూకంపాల భయంవల్లనైతేనేమి, హిమ్మపన్నులు ఇచ్చుకోలేకపోవడంచేతనైతే నేమి, లేక వృత్తిధర్మంచేతనైతేనేమి మనుష్యులు వేరువేరు రకాల యిళ్ళల్లో నివసించవలసివచ్చింది. ఏమయినప్పటికీ ఆయాపరిస్థితులకు అనుగుణంగా ఉన్న చోట్లలో మంచివీ అనువైనవీ మానవులు నిర్మించుకున్నారని చెప్పడానికి ఎట్టి సందేహమూ లేదు.

ఇదంతా వింటూవుంటే ఎంత విచిత్రంగా ఉంటుంది! ఇంతకీ తలదాచుకోడానికి ఇల్లంటూ ఒకటి కట్టుకోవాలనే ఆలోచన మానవులకు ఎలా వచ్చింది? అసలు అలాంటి అవసరం ఎందుకు కలిగింది? అందుకు వారు ఉపయోగించిన పరికరా లేమిటి? అవి ఎలా లభ్యమయ్యాయి? ఈ ప్రపంచంలో ఇన్ని రకాల యిళ్ళు ఎలా వచ్చాయి? అన్న ప్రశ్నలకు జవాబు కావాలంటే మానవ నాగరికతాపరిణామగాథ నంతనీ అవగాహనచేసుకోవలసిఉంది. ఈ సందర్భంలో మనం కొన్ని ముఖ్యమయిన ప్రశ్నలకు జవాబులు తెలుసుకుందాం.

మనుష్యులు నివసించడానికి ఇళ్ళు ఎందుకు కావాలి? ఈజిప్టు దేశస్థులు ఇటికయిళ్ళలో నివసించే వారు కదా. ఖామదుంగలతో కట్టిన యిళ్ళలో కాని ఎందుకు నివసించే వారు కారు? మనుష్యులు ఇళ్ళు ఎలా కట్టుకుంటారు? గృహనిర్మాణానికి వాడుకోవలసిన సామగ్రిని ఏ పరిస్థితులను బట్టి ఎంచుకుంటారు?

ప్రపంచంలోనివివిధ దేశాలలో, వివిధ కాలాలలో ఉండే ఇళ్ళలో నివసిస్తే ఎలా ఉంటుంది? చల్లగా ఉంటుందా? వేడిగావుంటుందా? దుమ్ముగాఉంటుందా? పొగగాఉంటుందా, చీకటిగా ఉంటుందా? వెలుగుగా ఉంటుందా? విశాలంగా ఉంటుందా? ఇరుకుగా ఉంటుందా?

తాము నిర్మించుకున్న గృహాలలో జనుల కుటుంబ జీవనం ఏరీతిగా ఉండేది? వాళ్ళ వంట పద్ధతులూ, ఆహార విహారాలూ, స్నానపానాదులూ ఏవిధంగా ఉండేవి?

ఇళ్ళుకట్టేటప్పుడు శీతోష్ణ పరిస్థితులు ఎలా గమనించ వలసి ఉంటుంది? ఎక్కువ వర్షాలు పడేచోట మట్టియిళ్ళు కట్టుకుంటారా? శీతాకాలంలో మంచుపడేచోట పూరియిళ్ళు పనికివస్తాయా?

చుట్టుపట్ల దొరికేసామగ్రినిబట్టి ఇళ్ళనిర్మాణం ఎలా మారుతూవుంటుంది? చెట్లు లేని ప్రాంతంలో దుంగలఇళ్ళు లేస్తాయా? ఇసుకఎడారిలో రాతిఇళ్లు కనపడతాయా?

మంచిమంచి పనిముట్లు తయారుకావడంతో గృహ నిర్మాణం సులభతరం, సుందరతరం ఎలా అయింది? ఆధునిక యంత్రాలసాయంవల్ల ఆధునిక గృహజీవనవిధానం ఎలా అభి

వృద్ధిఅయింది? గుహలలోనూ, గుడారాలలోనూ, పూర్వ కాలపు దుర్గాలలోనూ నివసించేవారి జీవనం ఏ ఆధునిక ఆవి ష్కారాల ఫలితంగా సుఖతరం అయిఉండేది?

ఈ ప్రశ్నపరంపర అంతకీ మనం చెప్పుకోగల జవాబే ఈ గ్రంధస్థవిషయం.

పూర్వకాలంలో మన ప్రపంచంలో అసలు ఇళ్ళే ఉండేవికావు. ఆ పురాతనకాలంలో నివసించే ఆదిమమానవు లకు తుపాకులూ, కత్తులసంగతే తెలియదు. సూదిలా వాడిగా ఉండే రాతి ఆయుధాల్నీ, మోటురకం బల్లాలీ్ని ఉపయో గించి జంతువుల్ని వేటాడి వాటి మాంసంతో పొట్టనింపుకునే వారు. చేపలుపట్టడంకూడా వాళ్ళకుతెలుసు. చేపలూ, మాంసమూ దొరకనప్పుడు కాయకసరుల్నీ, కందమూలాల్నీ తిని కడుపునింపుకునేవారు. పచనంసంగతి తెలియదు కనక పసిపిల్ల బాలాదివృద్ధులుసహితం పచ్చిమాంసం కోరలతో పీక్కుతినేవారు. ఈమాట వినగానే 'వీళ్ళెంతటి నాగరికులు' అనిపిస్తుంది కదూ! పైగా వీళ్ళు వట్టి పిరికివాళ్ళు. ఆనూ పానూ తెలియని కొత్తవాటిజోలికి పోయేవారుకాదు. వీళ్ళకి ప్రతిదీ కొత్తగానే ఉండేది. ఆ రోజుల్లో వీళ్లు మనలాగ సంసారాలు ఏర్పాటుచేసుకొని కాలక్షేపంచేసినట్టుకనబడదు. బహుశా తమ్మందర్నీ కూడగట్టి శత్రువులబారినుంచి రక్షించ గల ఒక బలశాలి చెప్పుచేతలలో బతికినట్టు కనబడుతూంది. జనం ఇలా గుంపులు గుంపులుగా, తెగలు తెగలుగా విడిపోయి ఎవరి జబ్బసత్తువకొద్దీ వాళ్ళు వేటాడి పొట్టపోసు కునేవారు. పంటలు పండించడం ఎలాగో, దొరికిన ఆహా

రాన్ని శీతాకాలంనాటికి దాచుకోవడం ఎలాగో వాళ్ళకి తెలియదు. ఆహారాన్ని అన్వేషించుకుంటూ వాళ్ళు యోజనాలు వెళ్ళిపోతూ ఉండేవారు. మధ్యలో అలసటవల్ల నిద్ర వస్తే దగరలోఉన్న చెట్లెక్కి పడుకొనేవారు. లేకపోతే పదిమందీ కలిసి కట్టకట్టుకొని పడుకొనేవారు. ఇందుకు కారణం తమకంటే ఎంతో శక్తివంతమైన జంతువులు తమ్ము కబళించకుండా కాపాడుకోవాలనే ఆత్మరక్షణదృష్టే. ఎలుగులూ, పులులూ, వేటకుక్కలూ, పైగా తమతో శత్రుత్వం వహించిన తోటి మానవులూ ఏమరుపాటున వచ్చి చంపిపారవేయకుండా చెట్లమీద కాపరంచేసేవారు. కాని శీతాకాలం వచ్చేసరికి చలిబాధకి తట్టుకోలేకపోయేవారు. ఇంక ఎండ, వాన, గాలి తాకిడికి తాళలేక గుహలలోకి వెళ్ళిపోయేవారు. కాని ఈ గుహలు రాళ్లూ రప్పలతో నిండివుండి, చీకటిగానూ, తేమగానూ ఉండేవి. అందులో నివాసమంటే ఇంచుమించు నరకంలాగే ఉండేది. వీటిలోకి క్రూరజంతువులు చొచ్చుకువచ్చి తమ్ము కబళించివేయకుండా పెద్దపెద్ద రాళ్ళు గుహముందు అడ్డంగా పెట్టేవారు. ఇలాంటిగుహలు పశ్చిమయూరపులో—ముఖ్యంగా స్పెయిను, ఫ్రాన్సు దేశాలలో—ఉండినట్లు ఇటీవల కనుగొనబడింది.

కాలంతోబాటు మనుష్యులూ మారారు. జంతు సంతానమూ మారింది. ఆనాటి ఖడ్గమృగాలూ, మామత్స అనబడే బ్రహ్మాండమయిన ఏనుగులూ, జాంబవంతునివంటి ఎలుగుగొడ్లూ, పులికి మేనమామలు అనిపించుకునే అడవి

పిల్లులూ... ...అన్నీ కాలగర్భంలో కలిసిపోయాయి. క్రమంగా మంచుకొండలు ఉత్తరధ్రువం నుంచి దిగువకు దొర్లిపడేవి హిమానీ నదులుకూడా వస్తూఉండేవి. ఇవి వెళ్ళి నంతమేర చుట్టుపక్కల వాతావరణంఅంతా హిమశీతలమయి పోయేది. ఆ చలికి తట్టుకోలేక కొంచెం వెచ్చగాఉండే దక్షిణాది ప్రాంతానికి జంతువులు తరలిపోయేవి. కాని ఈ మామత్స అనబడే ఏనుగులూ, ధ్రువపు జింకలూ, కస్తూరి మృగాలూమాత్రం ఆ చలిలో అలాగే కాలక్షేపంచేస్తూ ఉండేవి. మానవులు నివసించే గుహలుకూడా తేమగా చలిగా ఉండేవి. కాని చెట్టు చేమల మీదా, కటికి నేలమీదా కాపరం చెయ్యడంకంటే గుహానివాసం కాస్త మెరుగుగా ఉండేది. ఆదిమ మానవులు నిప్పుచేయడం ఎప్పుడు ఎలా తెలుసుకున్నారో చెప్పడానికి మనదగ్గర దాఖలాలుఏమీ లేవు అయితే వారిలోఎవరోఒకరు కారుచిచ్చుకు అంటుకునిమండు తున్న చెట్టుకొమ్మకొరివిని కదానివితానున్న గుహకుతీసుకొచ్చి ఉండవచ్చు, లేదా సెగలూ, పొగలూ చిమ్ముకుంటూ అగ్ని పర్వతశిఖరంమీదినుంచి కిందికి ప్రవహించే శిలాద్రావకానికి తగిలిన కర్ర మండుతూ ఉంటే, అదేదో వింతగా చేత పట్టుకుని గుహకు తెచ్చి ఉండవచ్చు. ఏది ఏమైనప్పటికీ నిప్పు సంగతి తెలియడంతో గుహలనుంచి చీకటీ, తేమా అదృశ్యం అయిపోయాయనే చెప్పాలి. ఆదిమ మానవులకి వేటయే ప్రధానమయిన బ్రతుకుతెరువుగా పరిణమించిందని చెప్పాను. వీరు జలాశయాల దగ్గర నీళ్ళు తాగడానికి వచ్చే జంతువులను వేటాడడానికి పొంచుకుని కూర్చునేవారు. బలిమీద

వీటిని చంపడం కంటె జలాశయాల దగ్గర వీటిని వేటాడడం సులభంగా ఉండేది. నేలబారున ఉండే గుహల కంటే కొండ కొమ్ములమీద ఉండే గుహలే క్రూరజంతువుల బారినుంచి కాపాడుకోడానికి ఎక్కువ వీలుగా ఉండేవని వీరు అనుభవం మీద తెలుసుకున్నారు.

మొద్దుగా వుండే కొయ్య గడల కంటే, రాతి పరశువుల కంటే, పదునుగా ఉండే సాధనాలవల్ల ఎక్కువ ప్రయోజనం లభిస్తుందని కాలం గడిచినకొద్దీ తెలుసుకున్నారు. అలాగే పిడికి మెరుగుపెట్టడంవల్ల, ఆయుధాన్ని సులువుగా విసరవచ్చునని తెలుసుకున్నారు. అందుచేత తమ పనిముట్లన్నిటికీ బాగా మెరుగుపెట్టి పదునుపెట్టేవారు. తాము వేటాడి చంపి తెచ్చిన జంతువుల చర్మములను ఒలిచి, ఎండబెట్టి, వాటిని వానజల్లుపడకుండా గుహలగుమ్మాలకు అడ్డుగా తెరలుగా వేలాడగట్టేవారు. ఈ చర్మాలనే మడిచి కుటుంబంలోవాళ్ళందరూ దుస్తులుగా ధరించేవారు. నిప్పుసంగతి తెలియకపూర్వం పచ్చిమాంసమే తినేవారు. ఎప్పుడో ప్రమాదవశాత్తూ మంటలోపడి ఉడికినమాంసం తినగానే వారికి పచనంప్రభావం అర్థమయిఉంటుంది. అప్పటినుంచీ మాంసం కాల్చితినేవారు. అలాగే పళ్ళూ, ఫలాలూ, కందమూలాలూ నిప్పులో మగ్గపెట్టి తినేవారు. ఆ రోజులలో ఆడవాళ్ళుకూడా మగవాళ్ళతో సమానంగా వేటకు వెళ్ళేవారు. కాని నిప్పుసంగతి తెలియడంతో ఆలనా, పాలనాలేక ఆ నిప్పు ఆరిపోతుందేమో అనే భయంతో ఆడవాళ్ళూ, పిల్లలూ ఇళ్ళదగ్గరే ఉండిపోయేవారు. ఒకసారి ఆరిపోతే

ఆ నిప్పు తిరిగిచేయడం ఎలాగో వాళ్ళకి తెలిసేదికాదు. దాంతో ఆగంతుకంగా తలదాచుకోడానికి వచ్చినవారికి గుహ శాశ్వతవాసస్థానం అయిపోయింది. ఈవిధంగా మానవునికి మొదటియిల్లు ఏర్పడింది. అప్పటినుంచీ వాళ్ళు ఆ గుహలోనే వంట చేసుకునేవారు. అందులోనే తమ ఆయుధాలూ అవీ దాచుకునేవారు. వేటాడి అలసి సొలసిన పురుషులందరూ ఈ గుహలకు వచ్చి విశ్రాంతితీసుకునేవారు. కడుపునిండా తిని కంటినిండా నిద్రపోయేవారు. గుహలలోఉండే మంటలు చూచి క్రూరజంతువులు భయపడిపోయి ఆ పరిసరాలకైనా చేరేవికావు. అందువల్ల కుటుంబ జీవనం కాస్త కుదురుబాటుగా సాగించడానికి వీలయింది. అయితే కేవలం నిప్పుచేయడంలోనే వీరికి కాలం అంతా గడిచిపోయేదికాదు. గుహలో నేలమీద గడ్డి గాదం పరిచి మెత్తలు ఏర్పాటు చేసుకొని వాటిమీద పడుకొని నిద్రపోయేవారు. ఈ పాత తుక్కు అంతా పోగుచేసి నిప్పులో పారవేసేవారు. పైగా భావి అవసరాలకోసం సమిధల్నీ, కుశల్నీ సేకరించుకొని పెట్టుకొనేవారు. వీరికి ప్రకృతి పరిశీలనాశక్తి హెచ్చడంతో ఋతువెరిగి పంట పండించడం నేర్చుకున్నారు. ఆ రీతిగా లభించిన ఆహారాన్ని శీతకాలంనాటికి దాచుకునేవారు. ఇలా దాచుకోవడంకోసం కుండలు, కుండీలు తయారుచేసుకోడం కూడా నేర్చుకున్నారు. శీతాకాలంలో సాయంకాలంవేళలందు వెచ్చగావుండే నెగళ్ళచుట్టూ చేరి పురుషులు తమ తమ సాహసవృత్తాంతాలను కథలుగా చెప్పుకొనేవారు. వాళ్ళలో కాస్త చెయ్యితిరిగినవాళ్ళు ఈ గుహల గోడలమీద తాము

వులకు తేలిక అయిన పని. కాని ఈచెట్లమీద ఉండే ఇళ్ళ ఉనికిని తెలుసుకోడమే కష్టం. పైగా ఎత్తున ఉండి కిందికి వచ్చే శత్రువులను కొట్టడం చాలా తేలికపని. ఒకవేళ పరిస్థితి తప్పివచ్చి పారిపోవడమేఅంటూ వస్తే పలాయనానికి కూడా చాలా వీలుగా ఉండేది. మొదట్లో ఈ వృక్షాగ్రగృహాలను కట్టుకోడం చాలా తేలికగా ఉండేది. ఇవి నేలకు 10,15 అడుగుల ఎత్తున చెట్లకొమ్మలమధ్య నిర్మించబడేవి.

ఇంట్లోకి వచ్చినతరువాత క్రూరజంతువులూ, శత్రువులూ వెంటనే పైకిరావడానికి వీల్లేకుండా, నిచ్చెనలను పైకి లాగివేసేవారు. ముందుగా వెదుళ్ళను కొట్టుకువచ్చి కొమ్మలమధ్య వరసగా మిద్దెలాగ ఉండేటట్టు పరిచేవారు.

ఈ వెదుళ్ళను చెట్లకొమ్మలకు తాటివడపలతోనో లేక పేముతడపలతోనో గట్టిగాబిగించి కట్టేవారు. గోడలూ, పైకప్పు నిమిత్తం ముందుగా తడకలుకట్టి ఆ తడకలమధ్య నుంచి పచ్చిగడ్డికాని, పూరికాని కొబ్బరి లేక తాటిమట్టలను కాని దూసేవారు. ఫిలిప్పైన్ దీవులలోనూ, న్యూగినీలోనూ అనేకమంది ఇప్పటికీ ఇలాంటి చెట్లయిళ్ళలో నివసిస్తున్నారు. వీరు కుండకుంపట్లను ఇంటిదూలాలకు వేలాడదీసి వాటిలో వంటచేసుకుంటారు. అందువల్ల అగ్నిప్రమాదం ఉండదు.

ఆ తరువాత చెప్పదగింది సరస్సులమధ్య ఉండే ఇళ్ళ సంగతి. కాలం గడిచినకొద్దీ మానవులకు సాంఘికానుబంధం ఎక్కువ అయింది. దిమ్మరితనం తగ్గిపోయింది. ఫలితంగా ఇరుగుపొరుగులలో స్నేహసంబంధాలు పెరిగి సౌమనస్యం పెంపొందింది. వ్యక్తులు కుటుంబాలై, కుటుంబాలు కులాలై,

కులాలు పల్లెలై, ఆ పల్లెలు పట్టణాలుగా వృద్ధిచెందాయి. గ్రామాలలో వీరంతా పరస్పర సహకారంతో పంటలు పండించుకోడం, నూలువడికి నేసుకోడం, కుమ్మరం, కమ్మరం వడ్రంగం వగైరా వేరువేరు వృత్తులు బయలుదేరాయి. ఈ నూతన సాంఘికవ్యవస్థలో జనులు తాము పండించిన పంటలూ, తయారుచేసిన వస్తువులూ వినిమయంచేసుకునే వారు. దాదాపు 7,000 సంవత్సరాలకుపూర్వం మానవుడు ఒకగొప్ప ఉపకరణాన్ని కనుక్కున్నాడు అది గొడ్డలి. గొడ్డలి కూడా ఒకగొప్ప ఉపకరణమేనా అనిపించవచ్చు. గొడ్డలికి పొడుగాటి కామ బిగిస్తే చాలా ఉపయోగంగా ఉంటుంది అని తెలుసుకోడంవల్లనే కలపకొట్టి కొయ్యఇళ్ళను నిర్మించుకొని గృహావాసానికి స్వస్తిచెప్పి, పదిమందితో కలసిమెలసి తిరగడానికి మానవులకు వీలుకలిగింది. ఆదికాలంనాటి గొడ్డళ్ళు కేవలం పొడుగాటికొయ్యకు తాడుకట్టి బిగించిన పదునైన రాతిముక్కలుతప్ప ఇంకేమీకాదు. తరవాత తరవాత ఆగొడ్డళ్ళకి కామ బిగించడానికిపీలుగా చిల్లులుకొట్టేవారు. రాతిగొడ్డళ్ళతరువాత కంచుగొడ్డళ్ళు వాడుకలోకి వచ్చాయి. స్విట్జర్లండులోని జెనీవాసరస్సుతీరంలో 7,000 సంవత్సరాల నాటి మనుష్యుల జీవితానికి సంబంధించిన వివరాలు కొన్ని బయటపడ్డాయి. ఆనాటి యిళ్లను చూస్తే అవి కొయ్యదుంగలను నీళ్ళలో పాతి, వాటికి దూలాలు బిగించి వరదలకూ, జంతువులకూ అందనిరీతిగా నీళ్ళమధ్య ఎంతో ఎత్తున సురక్షితంగా కట్టబడినవని తేలింది. ఇవి సాధారణంగా కొయ్యతో కట్టేవారు. కప్పులకు పూరికాని, పచ్చికకాని నేసి, వాన



అమెరికాలో తొలినాటి వలసదారులు నిర్మించిన రాతిఇళ్ళు

బారి నుంచి కాపాడుకొనేవారు. వీరికి చేపలవేట ప్రధానమైన వృత్తిగా ఉండేది. కారణం చెప్పనక్కరలేదనుకుంటాను. చేపల్ని కూరవండుకుని తినివేసి, పొలుసులు మళ్ళీ నీళ్ళలోనే పార వేసేవారు. పడవలెక్కి పరిసరప్రాంతాలకు షికారువెళ్ళే వారు. ఇంట్లో యెక్కువగా సామానులేమీ ఉండేవికావు. పాలూ అవీ చీమలకు అందకుండా పిడతలలో పోసి ఉట్ల మీద వేలాడకట్టేవారు. పీచుపరుపులు వాడేవాగు. తాళ్లు అల్లడం ఎలాగో తెలియదు కాని, చెట్లనారతో వలలు మాత్రం అల్లేవారు. ఉచ్చులుపన్ని పిట్టల్ని పట్టుకొనేవారు. నారబట్టలు నేసుకొనేవారు. వీటికితోగు తాము వేటాడి తెచ్చిన జంతువులచర్మాలు కూడా ధరిస్తూఉండేవారు. ఈ నాడు మనలో విలాసినులు చర్మపుకోటులు ధరిస్తున్నారు. మనం చెప్పులూ, బెల్టులూ, చర్మపుమేజోళ్ళూ వాడుక చేస్తూనే ఉన్నాం. అయితే ఆకాలంనాటి ఇళ్ళు అన్నీ ఇలాగ



*14వ శతాబ్దములోని నార్వేజియన్ కొయ్య ఇల్లు*

సరస్సులమధ్య నిర్మింపబడలేదు. ప్రపంచం అంతటా ఇళ్ళు కట్టుకుని నివసించిన అనేకజాతుల జనులు తగిన పనిముట్లూ ఉపకరణాలూ అందుబాటులో లేక ఆరోజులలో వట్టి గుడిసెలుమాత్రం వేసుకుని కాలక్షేపంచేసేవారు. అవయినా అక్కడి వాతావరణ పరిస్థితులకు అనువుగా నిర్మింపబడినవే.

ప్రపంచంలో శీతోష్ణపరిస్థితులు ప్రాంత ప్రాంతానికి మారుతున్నాయి కనుక వాటితోపాటే ఆయా ప్రాంతాల యిళ్ళ రూపురేఖలుకూడా మారుతూఉంటాయి. ఉష్ణమండల ప్రాంతాలలో వెదురుతో కట్టిన పూరిళ్ళు విశేషంగా కనబడతాయి. పూరీ, వెదురూ లభించని శీతలప్రదేశాలలో కొయ్యతోనూ, రాళ్ళతోనూ ఇళ్ళు కట్టుకొనేవారు. రాళ్లో కలపా దొరకనిచోట అడుసుతొక్కి మట్టితో ఇళ్ళు కట్టుకునేవారు. ఎడారి భూములలో గొర్రెలకాపరులు

చర్మాలతో యిళ్ళు కట్టుకునేవారు. ఈబాపతు జనులందరూ యేదేశంలో నివసిస్తున్నప్పటికీ జంతువులను పెంచడంవల్ల తమతిండికి కావలసిన మాంసం అందుబాటులో ఉంటుందని గ్రహించారు. వీరు జంతువులను తమ యిళ్ళలో కట్టివేసి పెంచేవారు. లేకపోతే తమయింటికి దగ్గరలోనే పాకవేసి వాటిని అందులో కట్టివేసేవారు. మేకలు, గొఱ్ఱెలు, గుఱ్ఱాలు పశువులు, పందులు వీటిని అన్నిటికన్నా ముందుగా మచ్చిక చేసుకున్నారు. ఆహారం కావలసివచ్చినప్పుడు, అతిథి వచ్చిన ప్పుడు వీటిలో ఏదో ఒకదానిని చంపి వండిపెట్టేవారు. భారత దేశంలో అతిథిని 'గోఘ్న' అనేవారట. అనగా అతిథి వచ్చి నప్పుడు తప్పకుండా గోవునిచంపి విందుచేసేవా రన్నమాట. ఈ పెంపుడుజంతువుల కాపలాకోసం కుక్కల్నికూడా మచ్చిక చేసుకున్నారు. తమ ఇళ్ళ చుట్టుపక్కల భూమినిదున్ని పదును చేసి గోధుమ వగైరా ధాన్యాలను పండించడం ప్రారంభిం చారు. ఇంట్లో ఆడవాళ్ళు వీటిని వేయించి, తిరగలిలో పిండి విసిరి మట్టికుండలోపెట్టి కరువుకాలానికి దాచిపెట్టేవారు. ఈ పిండిని నీళ్ళతోకాని, పాలతోకాని కలిపి రొట్టెగా కాల్చు వచ్చునని ఒక ఇల్లాలు తెలుసుకోగానే ఈ ప్రపంచంలో మొదటిరొట్టె తయారై వుంటుంది.

ఆరోజుల్లో మగపిల్లలకు కత్తులు, సుత్తులు, ఉలి, బల్లెం వగైరా ఆయుధాలుచేయడం ఎలాగో నేర్పేవారు. ఆటలద్వారా వేటాడటం నేర్పేవారు. అలాగే చేపలుపట్టడం జంతువులను చంపి మాంసంవండడంఅంతా నేర్పేవారు. ఇంక బాలికలు ఇంట్లోవుండి తల్లికి సాయంచేస్తూ వంట అంతా

నేర్పేవారు. నూలుతీయడం, నేతనెయ్యడం, చర్మాలతో దుస్తులు తయారుచేయడం, వంట, వడ్డన, శిశుపోషణ అంతాకూడా తల్లులు ఆడపిల్లలకు నేర్పేవారు.

ఖాళీగా వున్నపుడల్లా ఆడవాళ్ళు,మగవాళ్ళు, పిల్లలు, వృద్ధులు, యువ్వనులు అంతా కలిసి మట్టికుండలకు చర్మం బిగించి మూసిన మృదంగాది వాద్యాలకు లయానుగుణ్యంగా నృత్యంచేసేవారు. ఈలలువేయడం, రుంజులుకట్టడంకూడా వీరికి తెలుసు. సంగీతంఅంటే అభిమానం కలిగింది.

తాము స్వంతఉపయోగం కోసం తయారుచేసుకునే వస్తువులన్నీ ఉపయోగంతోబాటు కంటికి ఇంపుగా ఉండే టట్టు అందంగా ఉంటే బాగాఉంటుందని స్త్రీలు, పురుషులు భావించేవారు. ఈ ప్రయత్న ఫలితంగానే అరివేణి కుండలు, నగిషీచెక్కిన కొయ్యపిడులు, ఇతర జిలుగు బుటేదారీ శిల్పం బయలుదేరింది. అందంగా కనబడాలనే తాపత్రయంతో కంక ణాలు, హార కేయూరాలు తయారుచేసుకున్నారు. దుస్తులు జారిపోకుండాఉండేనిమిత్తం 'పిన్నీసు'లనుకూడా కనిపెట్టారు. ఇవన్నీకూడా ఇటీవల ప్రపంచమంతటా పురాతత్వశాఖవారు త్రవ్వి తీసిన శిథిలాలలోనుంచి బయటపడ్డ విశేషాలవల్ల తెలి సిన విషయాలే. ఈ శిథిలాలలో ఆనాటి ప్రజల ఆయుధాలు, పాత్రలు, ఆభరణాలు అన్నీ దొరికాయి. కనుకనే అతి ప్రాచీనకాలంలో నివసించిన మన పూర్వులనుగురించి ఈ మాత్రమైనా మనకు తెలుసుకోవడానికి వీలవుతోంది.

ఓహో! విషయం విషయాంతరంలోకి దూకుతున్న ట్టుందే! ప్రకృత మనుసరామః. ఉష్ణమండలప్రాంతాలలో

నివసించే ప్రజలకు పూరిళ్ళు చాలా సుఖంగా ఉండేవని తెలుసు కున్నారు. ఈ పూరిళ్ళు కట్టుకొనేవారు కొందరు గోడలన్నీ అడుసుతో కట్టేవారు. వీరిలో కొంతమంది పూర్వం ఎవడో వృక్షాగ్రగృహవాస సౌఖ్యాన్ని ఇంకా మరిచిపోలేదో అన్న ట్టుగా కొయ్యలతో యెత్తుగామంచెనునిర్మించి ఆమంచెమీద పాక వేసుకునేవారు. చెట్టుమీదఉండేఇళ్ళకంటే మంచెమీద ఉండే ఇళ్ళు చాలా మెరుగయినవి. ఎందుకంటే ఈ మంచె యింటిని కావలసినచోట నిర్మించుకోవచ్చు. చెట్లమీద కట్టు కునే యిళ్ళయితే ఆచెట్లపెరుగుదలకు అనుగుణంగా వాటిని కట్టుకోవలసివచ్చేది. పైగా ఈ మంచెయింటిని కావలసినంత విశాలంగాకూడా గాలికి ఊగిపోకుండా కట్టుదిట్టంగా కట్టుకో వచ్చు. చెట్టుమీద కట్టుకునే యిళ్ళు ఇలా కాదు మరి. ముందుగా గుంజలు పాతి వాటిమీద దూలాలు వరుసగా పేర్చి ఆపైని పాకవేసుకుంటే చక్కని యిల్లు ఏర్పడుతుంది. ఈ పాకలగోడలు సాధారణంగా తేలి కగా తడకదడి మాదిరిగా ఉంటాయి. ఇలాంటి యిళ్ళు బోర్నియోలో, ఫిలిప్పైన్ దీవులలో, న్యూగినీలో, ఇండియాలో ఉన్నాయి. వీటికింద సాధారణంగా పశువుల్ని కట్టివేసుకొని, పుల్లలూ పిడకలూ దాచుకుంటూ ఉంటారు. వీటిని క్రూరజంతువులబారినుంచి కాపాడడంకోసం చుట్టూ దట్టంగా కంచెవేస్తారు. ఇలాంటి ఇళ్ళలో వంట అంతా తీగ ఉట్టితో వేలాడదీసిన మట్టి కుంపట్లమీద జరుగుతూ ఉంటుంది. పర్వత ప్రాంతాలలో ఇలాంటి మంచెయిళ్ళలో నివసించేవారు కావాలంటే బసీలలో మాదిరిగా మంచినీటి

కుళాయిలను కూడా ఏర్పాటుచేసుకోవచ్చు. ఎలాగంటే ఈ యిళ్ళవెనకనుంచి వచ్చే కొండవాగుల ప్రవాహంలోకి వెదురుగొట్టాలు జొనిపి ఒక చిన్న నీటిధారను తమ యింటి లోకి మలుపుకోవచ్చు. న్యూగినీలో ఆదిమవాసులు సాధారణంగా సముద్రపుటొడ్డున మంచెయిళ్ళు కట్టుకొని కాలక్షేపం చేస్తూ ఉంటారు. ఈ ఇళ్ళు సాధారణంగా అలల మీద సముద్రపు పాటుకూ పోటుకూ ఆగేటట్టు నిర్మించబడతాయి. అందుచేత పోటువేళ సముద్రం పొంగి నీరు దిగువకు జారవిడిచిన కశ్మలం అంతనీ ఊడ్చుకుపోతుంది. ఇరుగు పొరుగు యిళ్ళవారితో రాకపోకలు సాగించడం కోసం వీరు పట్టె వంతెనలు వేసుకుంటూ ఉంటారు. అమెరికావంటి దేశంలో శ్రీమంతులు వేసవికాలపు వేడిగాడ్పుల నుంచి తప్పించుకోడంకోసం ఇటుకలతో ఎత్తయిన స్తంభాలు నిర్మించి వాటి మీద కుంచెలు కట్టి, ఆ కుంచెలమీద కొయ్య యిళ్ళు కట్టించుకుంటూ ఉంటారు. ఇందువల్ల అడుగునుంచి చల్లనిగాలి ప్రసరించి ఇంటినంతటినీ చల్లబరుస్తుంది. ఈ మంచె యిళ్ళు సాధారణంగా పూరీ, పొడుగాటి కలపా పుష్కలంగా దొరికే దేశాలలో విశేషంగా నిర్మింపబడతాయి. ఆంధ్ర దేశంలో ధాన్యం నిలవచేసుకునే గుండ్రని గాదెలు నిజానికి మంచెయిళ్ళుతప్ప మరేమీ కాదు. సాధారణంగా మంచె యిళ్ళు గట్టిగా గాలివేస్తే పడిపోతాయేమోఅని అనుకునే వారు. ఆగ్నేయ ఆఫ్రికాలో స్వాజై లనబడే తెగవారు ఇళ్ళన్నీ ఇలాగ మంచెల మీద పూరితో కట్టుకుంటారు. చెత్త చెదారం ఎక్కువ పెరిగిపోయినప్పుడు అడుగు గుంజల్ని

పునాదులతో సహా కదిలించి ఇంటిని ఇంటిపాళంగా మరొక చోటికి మార్చివేస్తారు. ఈ చుట్టుగుడిసెలను వీరు సాధారణంగా వేమూ వగైరాలతో ముందు దడిఅల్లి పైన పూరి కప్పుతారు.

ఈరకం ఇళ్ళన్నీ ఉష్ణమండలం ప్రాంతాలలోవారికైతే బాగా పనికివస్తాయి. కాని, శీతలప్రాంతాలవారికికాదు. ఉష్ణమండలప్రాంతాలవారు గడ్డితో ఇళ్ళు కట్టుకుంటే, చలిదేశాలవారు పూరి కోయగా మిగిలిన వేళ్ళు మట్టిపెళ్లలతో సహా పెకలించుకువచ్చి ఆ బెళ్లలతో ఇంటికప్పు తయారు చేసుకుంటారు. ఐర్లండులో పెక్కుప్రాంతాలలో రైతులు ఈ గరికివేళ్ళను వంటచెరుకుగా వాడతారు. అక్కడ ఇళ్లు కట్టుకుందామంటే కలప దొరకదు. పొయ్యిలో పెట్టుకోడానికి కట్టెలు దొరకవు. అందుచేత అక్కడిప్రజలు ఇళ్ళను రాళ్ళతో కట్టుకుంటారు. రాళ్ళకీ, కలపకీ కూడా కరువువచ్చినప్పుడు రైతులు ఈ మట్టిబెళ్లలతోటే ఇళ్ళు కట్టుకుంటారు. ఈ మట్టిబెళ్ళలతో కట్టేయిళ్ళకు పైకప్పుగా వట్టి గడ్డి కప్పి, అది గాలికి ఎగిరిపోకుండా గడ్డితాళ్లువేసి గట్టిగాకడతారు. ఐర్లండు దేశంలో ఇలాంటియిళ్ళలో పొగపోవడానికి గొట్టం ఏమీ ఉండదు. కనక, లోపల అంతా పొగవాసనవేస్తూఉంటుంది. ఇలాంటి మట్టిబెళ్ళయిళ్లు కట్టుకునేవారు ఒక్క ఐరిష్‌వాళ్ళే కాదు. అలాస్కాలో నివసించే రైతులూ, అమెరికానైఋతి భాగంలో నివసించే నోవాజో ఇండియన్లూ కూడా ఇలాంటి బెళ్ళలతో ఇళ్ళు కట్టుకుంటూ ఉంటారు. వాటిని 'హోగన్స్' అంటారు. వేసవికాలంలో వీరంతా గొర్రెలను కాచుకుంటూ



నోవాజోలనబడే రెడ్ ఇండియన్‌లు నిర్మించుకునే
'హోగన్' అనబడే కలపఇల్లు

దేశదిమ్మరులుగా ఉంటారు. కనుక ఈ యిళ్ళలో నివసించ కుండా ఎప్పటికప్పుడు తేలికగా తరలించుకుపోవడానికి వీలుగా ఉండే పూరిగుడిసెలను వేసుకుంటూ ఉంటారు. ఇంక చలి కాలంలో మాత్రం ఆరుకోణాలుఉండే హోగన్లను నిర్మించుకుని కాలక్షేపం చేస్తారు. ఈ హోగన్లు నిర్మించడం ఎలాగో తెలుసా? ముందుగా బలమయిన దుంగల్ని భూమిలో లోతుగా పాతుతారు. వాటిమీద కలప పేరుస్తారు. దాని మీద ఈమట్టిబెళ్ళల్ని పట్టుకువచ్చి గోడలాగ కూర్చుతారు. పొగపోవడంకోసం పైకప్పులో ఒకమూల చిన్నరంధ్రం పెడతారు, అంతే. వేరే కిటికీలూ అవీ ఏమీ ఉండవు. గుమ్మాలకి కంబళి వేలాడగడతారు. సాధారణంగా తలవెంట్రుకల వంటి గరిగివేళ్ళమధ్య చిక్కుకున్న ఒండ్రుమట్టి బెళ్ళలు ఆరిపోయినతరువాత రాతికంటేకూడా గట్టిగా ఉంటాయి. అందుకనే అనేకవందల సంవత్సరాలక్రితం అమెరికాలో స్పెయిను

దేశస్థులు ఇలాంటి మట్టిబెళ్ళలతో కట్టిన మందిరాలూ, భవనాలూ ఈనాటికీ చెక్కుచెదరకుండా ఉపయోగంలో ఉన్నాయి.

ఈరోజులలో కట్టే ఇలాంటి గృహాల్ని 'ఔరాన్స్' అంటారు. ఇవి సిమెంటుదిమ్మలమీద నిర్మించబడతాయి. ఇవి చూడడానికి 'ప్యూబ్లో' ఆదివాసుల యిళ్ళలాగ కనబడతాయి. దుంగలతోనూ, చెట్ల కొమ్మలతోనూ సులువుగా ఇళ్ళు కట్టుకోడం యెలాగో నేర్చుకున్న తరవాత మానవులు గోడలు గట్టిపరచుకునే నిమిత్తం రకరకాల ప్రయోగాలు చేయడం మొదలుపెట్టారు. అందులో ఒకటియీ తడికెలకు మట్టి పూయడం. ఎలాంటి తడికకైనా అడుసు పూత పెట్టడంతో చూచేవాళ్ళకు అది కొంపేనా అనిపించేది. ఆ పూత ఆరగానే గోడకు గట్టితనం రావడమే కాకుండా మొత్తంమీద ఇల్లంతా శీతాకాలంలో వెచ్చగానూ, వేసవికాలంలో కాస్త చల్లగానూ ఉండేది. పైగా కీటకాలు తొలచడానికి వీలులేనంత గట్టిగా ఉండేది. మట్టి పోగుచేసి నీళ్ళుకలిపి అడుసుతొక్కకుండా, దానితో గోడలు కట్టడం అంత కష్టమయిన పని కాదు. కాని అస్తమానం వానలుకురిసే తేమ వాతావరణంలో ఈ అడుసు గోడలు చిరకాలం మన్నవు. అందుకనే ఇలాంటి మట్టిఇళ్ళ నిర్మాణం యెండలు మెండుగా కాచే ప్రాంతాలలోనే ఎక్కు



ఎస్కిమోల మట్టి ఇల్లు

వగా కనిపిస్తుంది. మానవులు మట్టి ఇళ్ళలో నివసించడం యెప్పుడు ప్రారంభించారో మనం నిశ్చయంగా చెప్పలేము కాని 7,000 సంవత్సరాలకు పూర్వం సరస్సులమధ్య నివసించిన జనులు ఇలాంటి ఇళ్ళు కట్టుకుని అందులో నివసించేవారని తెలుస్తున్నది. బెల్జియన్ కాంగోలో నివసించే ఆదివాసులు మట్టితో చాలా అందంగా ఇళ్ళు కట్టుకుంటారు. వారు సన్నని కలప తీసుకువచ్చి నేలమీద పాతి దడిఅల్లేవారు. ఈ దడికిచుట్టూ బెందడి మెత్తేవారు. దానిమీద పూరికప్పు నేసేవారు. స్త్రీలు దీనికి పైని మెత్తని మట్టి తీసుకువచ్చి లేపనంచేసేవారు. ఎప్పటి కప్పుడు చేతులు తడిచేసుకుంటూ నున్నగా మెత్తేవారు. ఎండవేడికి గోడలు బిగిసిపోగానే గృహప్రవేశం చేసేవారు. ఇలాంటి మట్టియిళ్ళు 10, 15 సంవత్సరాలపాటయినా ఉంటాయి ప్రపంచం. మొత్తంమీద ఈనాటికీ మట్టియిళ్లే ఎక్కువగా ఉన్నాయి. చౌకకు చౌకగానూ, సుఖానికి సుఖంగానూ ఉంటాయి కనక చాలా మంది మట్టియిళ్ళే కటుకుంటారు. ఈ మట్టియిళ్లు రకరకాలు.

కొన్ని చుట్టుగుడిసెలలాగా, కొన్ని తేనెపట్టులలాగా, మరి కొన్ని చంద్రవంకలలాగా ఉంటాయి. ఈ గోడలు పచ్చిగా ఉన్నప్పుడే వాటిమీద చాలామంది నగిషీలు చెక్కేవారు. ఈ మట్టియిళ్ళకు సాధారణంగా కిటికీలంటూ ఉండవు. నేల అంతా గట్టిగా దిమ్మిసచేసి దానిమీద ఏతుంగచాపో పరచుకొని కాలక్షేపంచేస్తారు. పొగ భరించలేక సాధారణంగా వంటఅంతా బయటే చేసుకునేవారు. ఈవిధంగా మట్టిపూతపెట్టిన తడికగోడలకు బదులుగా కాలక్రమేణా మట్టితో ఇటుకలు చేసుకొని వాటితో ఇళ్ళు కట్టుకోడం మొదలుపెట్టారు. మట్టిని అడుసుగా తొక్కి దాన్ని చట్రాలలో పోసి ఇటుకలుచేసి ఆ పచ్చిఇటుకలను పేర్చి గోడలు కట్టేవారు. ఈ ఇటుకలు కొంచెం గట్టిగాఉండి విరగకుండా రాటుకూ పోటుకూ ఆగడానికి వీలుగా అందులో నారనూ, ఏసులనూ, గడ్డిపోచలనూ పెట్టి తయారుచేసేవారు. ఇలా ఇటుకలను ప్రపంచంలో అందరికంటే ముందుగా కనిపెట్టినవారు ఈజిప్టుదేశస్థులే అని కొంతమంది పురాతత్త్వవిదులు అభిప్రాయపడుతున్నారు. అయితే ఈ పచ్చిఇటుకలను కాల్చి పండించడం ఎలాగో వారికి తెలియదు ఈజిప్టులో కలికానికైనా కొయ్య దొరికేదికాదు. ఎప్పుడైనాకాస్త కలప దొరికితే దాన్ని తెచ్చి అస్తానపదంగా దాచుకుని దూలాలుగా వాడేవారు. మిగతాయిల్లంతా పచ్చిఇటుకలు పేర్చి కట్టేస్తారు. ఆఫ్రికనులూ, తదితర ఆదివాసుల యిళ్ళలాగ ఈజిప్టుదేశీయుల యిళ్ళకుకూడా కిటికీలు సాధారణంగా ఉండేవికావు. ఒకవేళ ఉంటే అవి చిన్న కంతలలాగ ఉండేవి.



ప్రాచీన ఈజిప్టు ప్రజలు నిర్మించుకున్న గృహం

ఇందుకు కారణం విశాలమయిన కిటికీలలో నుంచి సూర్య రశ్మి ఇంట్లో ప్రవేశిస్తే ఆ వేడికి తట్టుకోలేమనే భయంచేతనే వారు అలా ఇళ్ళు కట్టుకునేవారు. పైగా నేటికాలపు డాబాల లాగ ఈ యింటిపై కప్పు బల్లపరుపుగా ఉండేది. ఇందుకు కారణం అక్కడ వర్షాలు ఎక్కువగా లేకపోవడమే. వేసవి కాలంలో ఈజిప్షియను లందరూ నిచ్చెనవేసుకొని కప్పుపైకి ఎక్కి ఆరుబయటే నిద్రించేవారు. ఆ యింట్లో మండువా లాంటి చోట పొయ్యి పెట్టుకొని స్త్రీలు వంటలు చేసేవారు. కాని పొగగొట్టాలు ఏమీ లేకపోవడంచేత కిటికీలవెంటా, గుమ్మాలగుండా ఈ పొగఅంతా బయటికి పోవలసివచ్చేది. ఎంతడబ్బున్నవాళ్ళయినప్పటికీ ఈజిప్షియనులయిళ్ళకు పొగ గొట్టాలుండవు. ఇల్లంతా పొగచూరిపోయి కమురువాసన

వేయకుండా నౌకర్లు సెంటూ, అత్తరూ, పన్నీరూ నాలుగు మూలలా చల్లేవారు.

ఈజిప్షియనుల నుంచి ఈ బాపతు గృహనిర్మాణాన్ని స్పెయిను దేశీయులు నేర్చుకున్నారు. స్పెయిను దేశస్థులు ఉత్తరఅమెరికాకు వలస వెళ్ళినప్పుడు అక్కడ ఆదివాసులయిన పూబ్లో ఇండియనులకు అడుసు కలిపి పచ్చి యిటుకలు చేయడం ఎలాగో నేర్పారని కొంతమంది అభిప్రాయపడుతున్నారు. అయితే అమెరికాగడ్డమీద తెల్లవాళ్ళు పాదం మోపడానికి అనేక వేల సంవత్సరాలకు పూర్వమే అక్కడి ఆదిమవాసులు మట్టితోనూ, రాతితోనూ అనేక అంతస్తులు ఉండే మేడలు కట్టేవారు. ఇందులోకొన్ని ఇళ్ళు అయిదు అంతస్తులవి కూడా ఉన్నాయి.

ఈ ఆదివాసి ప్రజలు బయటినుంచి నిచ్చెన వేసుకుని పై అంతస్తుకు వెళ్ళి ఇతరు లెవళ్ళూ ఎక్కిరాకుండా ఆ నిచ్చెనను పైకి లాక్కునేవారు. ఈజిప్షియనులలాగే వీళ్ళకీ ఎండవేడి అంటే భయం కనక ఎండమాడ ఎక్కడ తగిలిపోతుందో అనే భయంతో ఎంత పెద్ద యిల్లయినా ఒక చిన్న కిటికీకూడా పెట్టేవారుకాదు. వీరు సాధారణంగా పనిపాటులన్నీ బయటే చేసుకుని లోపల గదిలో నిద్రపోయేవారు. ఈ మిద్దెలమీదే ఆడవాళ్ళు పిండి విసురుకునేవారు. మాంసం, కాయగూరలు ఎండబెట్టి వరుగులు చేసుకునేవారు. ఈ పూబ్లో ఇండియను లందరూ నాటికి నేటికి అలాగే ఉన్నారు. వీరిలో చాలామందికి కంబళ్ళనేత, కుమ్మరిపని బాగా చేతనవును. బంగారపుపని కూడా బాగా చేస్తారు.

ఈజిప్షియనులూ, పూర్వం ఇండియనులూ పచ్చియిటు కలతో ఇళ్ళుకట్టుకుంటే వాళ్ళకంటే ముందంజగు వేసినవాళ్లు అస్సీరియనులు. వీరు ఈ పచ్చియిటుకలు కాల్చి పండు ఇటుకలుగా మార్చారు. ఈనాడు ప్రపంచం అంతా అనుస రించేది ఈ విధానమే. ఈ సందర్భంలో అస్సీరియనులను గురించి ఒకమాట చెప్పాలి. వీరు ప్రధానంగా రైతులు. వ్యవసాయం, పశుపాలనా వీరి ముఖ్యవృత్తులు వీరు టైగ్రీస్ నదీతీరంలో ఉండేవారు. వీరు మొదట ఈజిప్షియనులనుంచి పచ్చియిటుకలతో ఇళ్ళుకట్టడం నేర్చుకున్నారు. అయితే ఈ పచ్చియిటుకల కంటే వాటిని ఆవలో పెట్టి కాలిస్తే అవి శాశ్వతంగా చెక్కుచెదరకుండా ఉంటాయని తెలుసు కున్నారు. పైగా ఆ ఇటుకలకు నిగనిగలాడే మెరుపు తీసుకు రావడం ఎలాగో కూడా వారు నేర్చుకున్నారు. ఈ రకం ఇటుకలను "మెరుగు ఇటుకలు" అంటారు. వీటితో వీరు రంగురంగుల చిత్రాలు తయారుచేసేవారు ఈ బాపతుగా వారు తమదేశాన్ని పరిపాలించిన రాజులు, సామంతులు వగైరా పాలకుల చిత్రాలు తయారుచేశారు. కొన్ని కొన్ని సందర్భాలలో రథాలెక్కి సింహాలను వేటాడు తున్నప్పటి చిత్రాలను తయారుచేశారు. అస్సీరియన్ ప్రజలలో సామా న్యులు ఎప్పుడూ ఈ పండుఇటుకల ఇళ్ళల్లో నివసించలేదు. వాళ్ళందరూ పచ్చిఇటుకల ఇళ్ళల్లోనే కాలంగడిపేవారు. ఈ అస్సీరియన్ల ఇళ్ళుకూడా చాలావరకు ఈజిప్షియన్ల మిద్దె ఇళ్ళమాదిరిగానే ఉండేవి. వేసంగి రాత్రులలో కుటుం బంలో అందరూ మిద్దెమీద ఆరుబయట పడుకునేవారు.

అసీరియన్ శ్రీమంతులు కొందరు ఎప్పుడైనా ఎండ లకు తాళలేనప్పుడు చల్లాగాఉండడంకోసమని కొన్ని ఉపా యాలను అవలంబించేవారు. మిట్టమధ్యాహ్నవేళ ఇంటి యజమాని దళసరి కంబళ్ళతో డేరా వేయించుకొని అం దులో కూర్చునేవాడు. దానిమీద నౌకర్లు చేదలతో చన్నీళ్లు తీసుకువచ్చి ఎప్పుడూ తడుపుతూ లోపల కూర్చున్న యజ మానికి సుఖంగా చల్లగా ఉండేటట్లు చేసేవారు. ఎండ వేడికి ఈ నీరు కాస్తా ఆవిరైపోతుండడంతో లోపల కూర్చున్న మనిషికి సుఖశీతలంగా ఉండేది. ఈ అసీరియన్ చిత్రకారులు తమమహారాజుల ప్రాసాదాలను అలంకరించడం కోసం అనేక వేల సంవత్సరాల క్రితం తయారుచేసిన రంగుబొమ్మలు ఈ నాటికీ వెలిసిపోకుండా కొత్తవాటివలె నిగనిగలాడుతూ ఉండడం ఒక అద్భుతమైన సంగతి.

ఈ అసీరియనుల దగ్గరనుంచి పండుఇటుకలు తయారు చేసే పద్ధతి ప్రపంచంఅంతా ప్రాకింది. రాళ్ళుదొరకనిచోట, దొరికినా ఖరీదు ఎక్కువయినచోట ఇళ్ళుకట్టుకోవడానికి పండుఇటుకలకంటె మంచివి, గట్టివి, చౌకగా దొరికేవి ఇంకేమీ లేవు. అలాగే కొయ్య కొరతగాఉండే సందర్భాలలో కూడా ఇటుకలు బాగా వినియోగపడతాయి.

ఈనాడు యూరప్‌లో, అమెరికాలో, రష్యాలో, ఆసియాలో ఒకచోటనేమిటి, ప్రపంచంలో అన్ని దేశాల లోనూ పండుఇటుకలతో కట్టిన ఇళ్ళే ఎక్కువగా ఉన్నాయి. అడవులు మెండుగాఉన్న నార్వే, స్వీడనులలోతప్ప తక్కిన యూరోపియన్ దేశాలలో ఇళ్ళు చాలావరకు ఇటుకలతో కట్టి

నవే. ఇందులో కొన్ని మూడు నాలుగు వందల సంవత్సరా లకుపూర్వం కట్టినవి. ఇవి మరీ పూర్వకాలపు ఇళ్ళలాగా నాలుగుప్రక్కల నాలుగు గోపురాలతో చౌకాలతో విచి త్రంగా కనబడతాయి.

ఇటుకలతో కట్టిన ఇళ్ళు శీతాకాలంలో వెచ్చగాను, వేసవికాలంలో చల్లగాను ఉంటాయి. ఇప్పుడు కొత్తగా కట్టే ఇళ్ళకు ఉపయోగించే ఇటుకలకు మధ్య నలుచదరంగా కన్నాం పెడుతున్నారు. ఇటుకమీద ఇటుక పేర్చినప్పుడు ఈ కన్నా లలో గాలి మిగిలిపోతుంది. ఇటుకపొరకీ పొరకీమధ్య గాలి ఉండటంవల్ల అది వేసవికాలంలో బయటి వేడిని లోపలకు రానీయకుండాను, శీతాకాలంలో లోపలివేడిని బయటికి పోనీ యకుండాను కాపాడుతుంది. సాధారణంగా పాటిమట్టి, నల్ల మట్టి, ఒండ్రుమట్టితో చేసిన ఇటుకలు చిరకాలం మన్ను తాయి. అందుకనే ఈ ఇటుకఆవములు మనకు సాధారణంగా నదులఒడ్డునో, కాలువలఒడ్డునో, పాటిచేలమధ్యనో కనబడుతూ ఉంటాయి. ఈనాడు ఇటుకలవ్యాపారం లాభసాటి వ్యాపా రంగా మారింది కూడా.

ఇళ్ళు ఇటుకలతో కడితే, గుళ్ళను రాళ్ళతో కట్టడం మనదేశంలో పరిపాటి. ఈనాడు దేవుళ్ళు రాళ్ళగృహాలలో నివసిస్తున్నా నిజంచెప్పాలంటే దేవునికంటే ముందుగా రాతి ఇంటిలో ఉన్నవాడు మానవుడే. ఆదిమమానవులు కొండ లలో సహజంగా ఏర్పడిన గుహలలో నివసించారని తెలుసు కున్నాం. ఈ గుహలు రాతిగుహలే కనుక వాటిని రాతిగృ హాలుగా వ్యవహరించుదాం. గాలి తాకిడికి, జలప్రవాహానికి

ఆగలేక బండరాళ్లు అరిగి గుహలు సహజంగా ప్రకృతిశక్తుల ప్రభావంవల్ల ఏర్పడ్డాయి. చాలాకాలం గుహావాసంచేసిన తరువాత మానవులు ఇళ్ళుకట్టుకోవడంకోసం రాళ్ళను ఏరి తెచ్చుకుని పేర్చుకునేవారు. రాళ్ళు బరువుగాఉండడం గట్టిగా ఉండడంచేత దగ్గర్లో లభిస్తేతప్ప ఆ రోజులలో హెచ్చుగా వాడుకచేసేవారు కాదు.

మొదట్లో వీరు దొరికినరాళ్ళను దొరికినట్లుగా తెచ్చి ఉంచేవారు. వారికి ఈ రాళ్ళను నాలుగుప్రక్కలా సమంగా ఉండేటట్లు చెక్కడం తెలియదు. క్రమంగా ఉలి, సుత్తి, పోగరువంటి సాధనాలు చిక్కగానే పెద్దరాతిని చిన్నముక్కలుగా పగులగొట్టి వంపుటొంపు లేకండా అంచులు వంచలు తీర్చేవారు. ఈవిధంగా పూర్వకాలంలో రాతితో మంచి మంచి ఇళ్ళు కట్టగలిగినవారు అమెరికా ఖండంలో ఇస్కా ఇండియన్‌జాతి ఆదివాసులు. నాలుగువందల సంవత్సరాలకు పూర్వం స్పానిష్‌దేశీయులు దక్షిణఅమెరికాకు తొలిసారిగా వలసవెళ్ళినప్పుడు పెరూలోఉండే ఇన్కాజాతివారు రాతియుగంలోనే నివసిస్తున్నట్లు కనుగొన్నారు. ఆరోజులలో వీరు రాతిఆయుధాలను, రాతి పనిముట్లులనుమాత్రమే వాడేవాళ్ళు. జాతీయులు నివసించిన ప్రాచీన గ్రామాలను మేచూ-పేచూ అనేవారు. ఈ గ్రామాలతాలూకు శిధిలాలను చూస్తే వారు ఎలా నివసిస్తున్నదీ మనకు తెలుస్తుంది. మొత్తం గ్రామం అంతా పెద్ద రాతికోటవలె ఉండేది. ప్రతి ఇల్లు రాళ్ళతో నిర్మించబడిందే. వారు ఈ రాళ్ళను సున్నితమైన యంత్రాల సాయం లేనప్పటికీ చేతులతోనే ఉలి వగైరాలు ఉపయో

గించి నున్నగా ఇటుకలవలె చెక్కి వాటిని పేర్చి ఇల్లుకట్టుకునే వారు. ఇలా పేర్చిన రాతికీ రాతికీ మధ్య చిన్న చీమదూర డానికైనా సందులేకుండా చేశారంటే వారి పనివాడితనం మెంత గొప్పదో మనం తెలుసుకోవచ్చు. గ్రామమంతా అంతస్థులు అంతస్థులుగా నిర్మించేవారు. అనగా ఒక ఇల్లు ఎత్తుగా ఉంటే దానికంటె కొంచెం పల్లంగా ఉండేటట్లు రెండో ఇల్లు కట్టేవా రన్నమాట. రోడ్లకుబదులుగా వాళ్ళు ఒక ఇంటినుంచి మరొక ఇంటికి వెళ్ళడానికి వీలుగా మెట్లు కట్టుకునేవారు. ఈ ఇళ్ళగోడలు త్రికోణాకారంగా ఉండేవి. వాటిమీద వాసాలు బిగించేవారు. ఆపైన పూరితో పై కప్పు నేసేవారు. ఈ ఇన్కాజాతీయులు చాలా నాగరికమైనవార నే చెప్పాలి. వారు రాతితో అక్విడక్టులు కట్టుకున్నారు. మిద్దె ఇళ్ళు కట్టుకోవడంకూడా వారికి తెలుసు. ఇళ్ళలోపల గోడ లకు ఎర్రపూత పెట్టేవారు. మిగతా ప్రపంచంలో అందరూ పురాతనపద్ధతిలో తలదాచుకుంటున్న సమయంలోనే ఇన్కా జాతీయు లింత నాగరికంగా బ్రతికారు.

కాలం గడిచినకొద్దీ జనులకు అనుభవం ఎక్కువ అయింది. ఆ అనుభవాన్ని పురస్కరించుకొని అవసరాలకు తగినట్లు ఎప్పడికప్పుడు కొత్త పనిముట్లు సృష్టించుకున్నారు. ఇల్లు కేవలం తలదాచుకోడానికే కాక విశ్రాంతితీసుకోడానికి కూడా నెలవు కావడంతో కంటికి అందంగా ఉండేటట్టు, మన స్సుకిమరులుగొలిపేటట్టుదాన్ని అలంకరించుకోవాలనేఅభిలాష కలిగింది. దానితో కేవలం ఉపయోగంనిమిత్తమే కాకుండా అలంకరణనిమిత్తంకూడా పనికివచ్చే పరికరాలు వాడుకలోకి

వచ్చాయి. ఆదిమానవులు కూడా మట్టితో కుండలుచేయటం నేర్చుకొన్నతరువాత అందంగా ఉండేటట్టు వాటిమీద గోటితో చిత్రాలు దిద్దేవారు. ఇలాగ గృహనిర్మాణ నైపుణ్యం మానవులలో క్రమంగా వృద్ధిపొందుతూ గ్రీకులకాలం నాటికి ఇంచుమించు పరాకాష్ఠ చెందింది అని చెప్పవచ్చు. ఇప్పటికి మూడు వేల సంవత్సరాలకు పూర్వమే గ్రీకులు గాలీ వెలుతురూ ధారాళంగా వచ్చే గదులతో విశాలమయినరాతి భవనాలు కట్టుకునేవారు. మొదట్లో వీరు తమ యిళ్ళు అన్నీ కూడా కొయ్యతోనే కట్టుకునేవారు. కాని తరువాత తరవాత కొయ్యదుంగలకు బదులు రాతికంబాలు వాడుకచేసేవారు. ఎథెన్సునగరప్రజలు ఆ రోజులలో రాళ్లతో చక్కగాకట్టిన యిళ్లల్లో నివసించేవారు. వీధులన్నీ మురికిగా చీకటిగా ఇరుకుగా ఉండేవి. అందుచేత ఎంతో పని ఉంటే కాని ఈఎథెన్సు ప్రజలు వీధిముఖం చూచేవారు కాదు. కాబట్టి వీధివైపు కిటికీలు పెట్టుకోకుండా దొడ్డివైపే పెట్టుకునేవారు. దొడ్డిని అందమయిన పూలమొక్కలతోను, ప్రతిమలతోనూ ఆలంకరించుకునేవారు. గ్రీసుదేశంలో శీతాకాలంలో మంచువానలు కురుస్తూఉంటాయి. ఎప్పటికప్పుడు కిందికి జారిపోయేటట్టు యింటికప్పులు కోసుగా యేటవాలుగా కట్టేవారు. శీతాకాలంలో చలిబాధ తప్పించుకోడానికి ఇంటిలో ఒక మూల కణకణలాడే నిప్పుకుంపట్లు పెట్టుకునేవారు. ఈ ఇళ్ళు వేసవికాలంలో చల్లగా ఆహ్లాదకరంగా ఉండేవి. ఇక భోజనాలగదిలో కుటుంబంలోనివారందరూ చిన్నచిన్న బల్లలమీద కంచాలు పెట్టుకొని భోజనంచేసేవారు. పడకగదులు ఎవరికి

వారికి పేరుగా ఉండేవి. గ్రీసు దేశంలో కన్యలు నేర్చుకోవలసిన మొదటిపని పక్కలు బాగా వేయడం. చీకటిపడగానే అందరూ పండుకొని నిద్రపోయేవారు. మేలుకునిఉంటే నూనెదీపాలు కాని, కొవ్వువత్తులుకాని వెలిగించుకునేవారు. గ్రీకులపద్ధతు లనుచూచి ముచ్చిపోయిన రోమనులు వారిని అనుసరించారు. అందమయిన దీపాలు, పూలకుండీలు, ఇతరసామగ్రి వాడుక చేయడం గ్రీకులదగ్గరనుంచి రోమనులు నేర్చుకున్నారు. రోమనులు యుద్ధాలలో గ్రీకులనుజయించి తమదేశానికి తీసుకు వచ్చిన గ్రీకు యుద్ధఖైదీలనుంచి గ్రీకుల ఆచారవ్యవహారాలు పూర్తిగా అలవరచుకున్నారు.

క్రీ. పూ. 146 వ సంవత్సరంలో కారిన్తు పటణాన్ని జయించిన రోమనులు తమనౌకలనిండా శాలరాతి బొమ్మల్నీ ఇతర కళాఖండాల్నీ తమదేశానికి తరలించుకొనిపోయారు. క్రీస్తుపూర్వం 29-14 సంవత్సరాలలో అగస్టస్ సీజర్ రోమురాజ్యాన్ని పాలించారు. ఆరోజులనాటికే ఆ దేశంలో అన్నిరకాల యిళ్ళు బాగా వాడుకలోకి వచ్చాయి. పేదలు అరలరలుగా ఉండే ఇళ్ళలో నివసిస్తూఉండేవారు. వీటిలో కొన్ని ఏడంతస్తుల ఎత్తుకూడా ఉండేవి. వీటిలో చాలాభాగం పూర్వకాలపు గృహశల్యాలను ఉపయోగించి కట్టినవే. ఈ పేదప్రజల యిళ్ళలో పొయ్యిలుండేవేకాదు. ఇలాగ పొయ్యి లేని ఇళ్ళలో నివసించేవారంతా ఆ వీథిలో ఏదో మూలను ఉండే భోజనశాలనుంచి భోజనం కొనుక్కునేవారు. దీనిని బట్టి హోటలువ్యాపారం ఈ 20 వ శతాబపు విశిషలక్షణం మాత్రమేనని ఎవ్వరూ భ్రమపడకూడదు. రోమనులకి



*సుమత్రాలో బాటక్ జాతిప్రజలుకట్టుకునే మంచుఇళ్ళు*

చక్కని ఇళ్ళుకట్టుకోవడం ఆ రోజుల్లోనే తెలుసు. ఈరోజుల్లోలాగే, ఇల్లుకట్టబోయేముందు ఏ గది ఎక్కడ ఎలా ఉండాలి అని చాలా బాగా ఆలోచించేవారు. పడకగదిలో బాలభానుని లేత కిరణాలు తప్పకుండా ప్రవేశించితీరాలని వారికి ఒక నియమం ఉండేది. బహుశా బద్ధకస్తులైన బడి పిల్లలు పొద్దెక్కినా నిద్రలేవకుండా ఉండడానికి వీలుండదని ఆశపడ్డారు కాబోలు! ఈనాడు మన వాల్తేరులోని విశ్వవిద్యాలయ ప్రాంగణంలో ఉన్న 'వినయ విహార్' విద్యార్థి వసతిగృహాన్ని చూస్తే తెలుస్తుంది, ఈ ఆశ ఎలాంటి అడియాసో. సాధారణంగా రోమనులు స్నానాలగదుల్ని ఇల్లంతలోకి వెచ్చగాఉండే తావుల్లో కట్టేవారు. నీళ్ళ పంపులను వేడినీళ్ళకాగులకు కలిపేవారు. రోమ్‌నగరంలో శీతాకాలం ఎప్పుడూ ఎముకలు కొరికేటట్లు చలి ఉంటుంది. అందుకని,

ఇల్లంతా సుఖోష్ణంగా, వెచ్చగా, హాయిగా ఉంచుకునే నిమిత్తం ఈనాటి ఇంజనీర్లు ఉపయోగించే విధానాలను పోలిన వాటినే అనుసరించేవారు. నేలకడుగున మట్టిగొట్టాలు బిగించి దాంట్లోంచి వేడినీటినో, వేడిగాలినో పంపేవారు. దానితో మొత్తం ఇల్లంతా వెచ్చగా ఉండేది. ఆరోజుల్లో బాగా డబ్బున్న రోమనుల ఇళ్ళు రాతిగోడలతో, పాలరాతి గచ్చుతో, పెంకులకప్పుతో, ఆటలగదితో, ప్రతివారికీ పడకగదులతో చాలా డాబుగా ఉండేవి. అందులో వంట ఇల్లు, భోజనశాల, అతిథిగృహం కూడా ఉండేవని వేరుగా చెప్పనక్కరలేదు. కాని ఎండలో హాయిగా చలికాగేనిమిత్తం సూర్యరశ్మి బాగా తగిలేటట్లు ఒక ఆతపమందిరాన్ని కూడా నిర్మించుకునేవారు. పైగా, ఇంటిచుట్టూ పెద్ద అందమైన తోట, ఆ తోటలో పువ్వులమధ్య అత్యంత ఆకర్షణీయములైన గ్రీకువిగ్రహాలు చాలా అందంగా ఉండేవి. ఆ నాటికే, వర్ణలేపనక్రియ, చిత్రలేఖనం బాగా వికసించినందున రోమనుల యింటిగోడలమీద రంగు రంగుల కుడ్యచిత్రాలు అలంకారప్రాయంగా చిత్రించబడినట్లు కనబడింది. ముఖ్యంగా, భోజనశాలలు ఇలాంటి రమ్యమైన చిత్రాలతో అలంకరించబడేవి. గ్రీకులమాదిరిగానే రోమనులుకూడా పడుకొని ఫలహారాలుచేయడం నేర్చుకున్నారు. ఇంట్లో ఉన్నవారందరికీ ఒక్కొక్కరికి ఒక్కొక్క బల్ల పెట్టి దాని మీద వడ్డనచేయడంకంటె మధ్యగా గుండ్రనిబల్లమీద అన్ని పదార్థాలూ అమర్చితే అందరూ తమశయ్యల్ని బల్ల దగ్గరకు ఈడ్చుకొని భోజనంచేసేవారు. ఆ తరువాత కొంత

మంది మోటుజాతులవారు వచ్చి రోమనులను జయించారు వీరికి బాగా అందంగా ఇళ్ళుకట్టుకోవడం తెలియదు. అందుచేత క్రీ. శ. 6 వ శతాబ్దం లగాయతు 11 వ శతాబ్దంవరకూ గృహనిర్మాణచరిత్రలో అంధయుగం అని వాస్తు శాస్త్రజ్ఞులు పేర్కొంటూ ఉంటారు. సరిఅయిన ఆలనాపాలనా లేక అంతకుపూర్వం రోమనులు గృహనిర్మాణకళలో చూపిన కౌశలం అంతా అణగారిపోయింది. ఆ సమయంలోనే వైకింగులూ తురుష్క ముష్కరులూ, యూరోపియన్ దేశాలపైబడి వాటిని కొల్లగొట్టి పూర్వులు నిర్మించిన సుందర సౌధాలన్నింటినీ అగ్గిపాలుచేసేశారు ఆ తరవాత అనగా పదునొకండవ శతాబ్దంనుంచి 14 వ శతాబ్దం వరకూ పశ్చిమ యూరపులో దుర్గనిర్మాణం, ప్రాసాదనిర్మాణం కొంచెం కొంచెంగా ప్రారంభమయింది. దుర్గాలను కట్టుకోవడం తెలియడంతో రాజులూ — సామంతుల మధ్య అధికారం కోసం, సంపదకోసం కీచులాటలు ప్రారంభం అయ్యాయి. ఆత్మరక్షణకోసమే ముఖ్యంగా ఆరోజులలో దుర్గనిర్మాణం సాగింది. ఎంతసేపూ శత్రునిర్భేద్యంగా ఉండాలనే కోరికతోనే ఈ కోటల నిర్మాణం పోటాపోటీలమీద సాగేది. ఆ రోజులలో ఈ కోటలు ఎలా ఉండేవో తెలుసా ? ఎదురెదురుగా వచ్చే రథాలుసయితం బాహాటంగా తప్పుకుపోవడానికి వీలయినంత వెడల్పుగల గోడలతో ఎత్తయిన బురుజులతో రెండు తాళ్ళఎత్తున ఉండేవి. సాయుధులయిన సైనికులు ఈ కోటబురుజులలో నుంచి శత్రువులపై శరవర్షాన్ని శతఘ్నివర్షాన్ని కురిపించేవారు. సప్తప్రాకారవేష్టితమయిన

ఈ కోటలలో పల ఆయాజాతులవారికి, వృత్తులవారికి తగినట్లు భవనాలూ, ప్రాసాదాలూ, హజారాలూ ఉండేవి. ఈ కోట గోడలచుట్టూ అగడ్త దాటి వెళ్ళడానికి ప్రతి సింహద్వారం దగ్గర వారధి ఉండేది. ఈ సేతువుని కావలసినప్పుడు ఉపయోగించి అక్కరలేనప్పుడు ఇక లోన ప్రవేశించడానికి వీలులేని విధంగా వెనుకకు ఎత్తివేయడానికి ఏర్పాటుఉండేది. ఈనాడు చెన్నపట్నం, పూనా, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, ఆగ్రా, ఇందూరు, గ్వాలియరు, ఫతేపురిసిక్రీ, అలహాబాదు పట్టణాలలో మొగలు సమ్రాట్టులేమి, ఆంగ్లేయ సార్వభౌములేమి, తదితర స్వదేశసంస్థానాధీశులేమి కట్టిన కోటలు ఇట్టివే. శాంతిసమయంలో కోటలోనివారికీ, బయటివారికీ వ్యాపార సంబంధాలు ఉన్నప్పటికీ యుద్ధకాలంలోసంపూర్ణంగా స్వయం సమృద్ధిగా ఉండడానికి అన్ని ఏర్పాట్లూ ఉండేవి. ప్రతి కోటలోనూ అంతర్భాగంగా వ్యవసాయదారులూ, కమ్మర్లూ వడ్రంగులూ మొదలయిన అష్టాదశవృత్తులవారూ ఉండేవారు.

యూరోపుఖండంలో ఇలాంటి రాతికోటలు చాలా ఉండేవి. కాని శీతకాలం వచ్చిందంటే చలిగాలికి, మంచు వానలకి వీటిలో ఉండేవారు బిగుసుకుపోయి యమయాతన పడేవారు. రాతిచప్టాచేసిన నేలమీద కాలు మోపలేక పీచు పరుపులూ, గోనెబరకాలూ పరుచుకొని వాటిమీద తిరిగే వారు. బహుశా ఈ వాడుకయొక్క అవశేషమో ఏమో భారతదేశంవంటి ఉష్ణదేశంలోకూడా సంపన్నులు నేలమీద

తివాసీలూ, జంబుకానాలూ, కంబళ్ళూ అలంకారప్రాయంగా పరుచుకుంటూ ఉంటారు.

రాళ్ళు దొరికేచోట రాతితోనూ, మట్టి దొరికేచోట మట్టితోనూ, పూరి దొరికేచోట పూరితోనూ ఇళ్ళుకట్టుకొనేట్టుగానే, అమెరికావంటి దేశాలలో, అడవులు హెచ్చుగా ఉండి కలప పుష్కలంగా దొరికేచోట కొయ్యతో ఇళ్ళు కట్టడం పరిపాటిఅయిపోయింది.

కొయ్యఇళ్ళు అంటే జ్ఞాపకమొచ్చింది. సరస్సుల మధ్య ఇళ్ళు కట్టుకుని నివసించేవారు కొయ్యఇళ్ళల్లో నివసించేవారని చెప్పిన జ్ఞాపకం. కాని ఈ ఇళ్ళలో కొంతభాగం దడి కట్టి పైన మట్టి మెత్తనివి. ఇందుకు కారణం లేకపోలేదు. రాతితోనూ, మట్టితోనూ కట్టినవాటివలె ఈ కొయ్యఇళ్ళు చిరకాలం మన్నవు. అందుచేత కొయ్యఇళ్ళు ఎంత పూర్వం నుంచి ఉన్నాయో చెప్పడానికి తగిన ఆధారాలు లేవు.

చెట్లు కొట్టి తీసిన కలపని మనం ఎన్నివిధాలుగానో వాడుకోవచ్చు. దూలాలుగా, స్తంభాలుగా వాడుక చేయవచ్చు. పలకలు కోసి తనాబీ పరచవచ్చు. తలుపులూ, ద్వారబంధాలు చేసుకోవచ్చు. కొయ్యను పలకలుగా కోసి ఉపయోగించవచ్చుననే సంగతి తెలియకపూర్వం నిలువునా పాతి అది ఆధారంగా ఇళ్ళు కట్టుకునేవారని మనం ఊహించవచ్చు. ఇలాంటి కొయ్యఇళ్ళను దూలాలు ఒకదానిమీద ఒకటి పేర్చి కట్టేవారు. ఈ బాపతు ఇళ్ళు విశేషంగా అమెరికాఖండం కనిపెట్టబడిన కొత్తలో నిర్మించబడ్డాయి. ఈనాటికీ నార్వేలోనూ, స్వీడన్‌లోనూ

ఇలాంటి కొయ్యఇళ్ళు చాలా కనపడతాయి. నిజానికి వీటి నిర్మాణం ఇతర దేశా లన్నింటిలోకన్న ముందుగా ఈ నార్వే స్వీడన్ దేశాలలోనే జరిగింది. ఇలాంటి ఇళ్ళను నిర్మించడంలో నార్వే దేశపు రైతులు చాలా నిపుణులు. ఇందుకోసం ముందుగా చెట్లనరికి బాగా ఎండబెట్టేవారు. కాండం బాగా ఆరినతరువాత పుంగుపట్టకుండా పైనఉండే బెరడుఅంతా వలిచేసేవారు. ఆతరువాత వాటిని పైపై, అడుగునా కొంచెం చదునుగా చెక్కి ఒకదానిపై ఒకటి గోడలాగా పేర్చేసేవారు. చలిగాలి రాకుండా మధ్యనున్న ఖాళీలను నాచుతో నింపేసేవారు. ఇంక ఇంటికప్పును గరికవేళ్ళుగల మట్టి పెళ్ళలతో పూర్తిగా మెత్తేసేవారు. ఒక్కొక్కసారి ఈ మట్టి పెళ్ళలలో ఏవైనా మొక్కల విత్తనా లుంటే వానలకి అవి మొలకెత్తేవికూడా. అలాంటప్పుడు యింటికప్పు అంతా ఒక పూలతోటలాగా కనబడేది. నార్వే దేశపు రైతులు సాధారణంగా తమకొకటీ, పశువులకొకటీ, ధాన్యంనిలవచేసుకోడానికొకటీ, నాగళ్ళు వగైరా దాచుకోవడానికింకొకటీ, సారా నిలవ చేసుకోవడానికొకటీ, రకరకాలుగా కొయ్యఇళ్ళు నిర్మించుకునేవారు. ఈ రైతులు ఎప్పుడో ఏటికీ కోటికీ తప్ప సాధారణంగా బస్తీకి వెళ్ళేవారేకాదు. అందుచేత తమకు కావలసినవన్నీ డబ్బునంతో సహా తామే తయారు చేసుకునేవారు. కొయ్యతో గరిటెలు, పళ్ళెములు అన్నీ చేసుకుంటూ ఉండేవారు. ఇంక వీరి పడకలన్నీ గోడలో అలమారాలో అమర్చబడిఉండేవి. ఇలాంటి పడకల ఏర్పాటు హాలెండు దేశంలో కొన్ని ప్రాంతాలలో ఈనాటికీ కనబడు

తుంది. వాటింటిలోనే కట్టెలు నిలవచేసేయేర్పాటు ఉండేది. పొయ్యి నేలమీద ఉండకుండా మోకాలు ఎత్తున ఉండే వంటఅరుగుమీద ఉండేది. ఇందువల్ల పదిమందివచ్చినప్పుడు గుండిగలు వార్చడానికి తేలికగా ఉండాలి. పొగ పోవడానికి పొయ్యిమీదుగా పెద్దగొట్టం ఉండేది.

ఈ కొయ్యఇళ్ళు శీతాకాలంలో వెచ్చగానూ వేసవి కాలంలో సుఖ శీతలంగానూ ఉంటాయి.

దేశ దేశాలలో అమలులో ఉన్న గృహనిర్మాణ పరిస్థితులను పరిశీలించి చూడగా ఈ ప్రపంచంలో ఇళ్ళు అనేక రకాలుగా ఉన్నాయని తేలింది. ఇవి ఇలా ఉండడానికి కారణం స్థానికమైన పరిస్థితులూ, వాతావరణం, శీతోష్ణ భేదాలూ, పరిసరాలూ అని చెప్పాలి. నార్వేలో రైతులు కొయ్యతో ఇళ్ళు కట్టుకున్నారంటే అందుకు కారణం మూలాలు పుష్కలంగా, చౌకగా లభించడమే. అలాగే పూరిఇళ్ళూ, మట్టిఇళ్ళూ కట్టుకునేవారికి తమ పరిసరాలలో పూరీ, అడుసూ పుష్కలంగా లభించి, కలప లభించడంలేదన్న మాట. ఇక ఈజిప్టుదేశస్థులు పచ్చిఇటుకల ఇళ్ళు కట్టుకున్నారంటేనూ ఆఫ్రికాలో నివసించే ఆదివాసులు గడ్డిఇళ్ళు నిర్మించుకున్నారంటేనూ, దానికికారణం వారికి కలప కలికానికైనా దొరకకుండా అడుసుమట్టీ, గడ్డీ కావలసినంత అందుబాటులో ఉండడమే. పర్వతప్రాంతాలలోనివసించేవారిఇళ్ళు అతి విచిత్రంగా ఉంటాయి. సిమ్లా, డార్జిలింగ్ వంటి హిమాలయ పర్వతపాదప్రాంతంలో నివసించేవారూ, స్విట్జర్లండ్ వంటి పర్వతమయమైన దేశంలో నివసించేవారూ చలికాలం

వచ్చిందంటే చాలా బాధపడకతప్పదు. ఎప్పుడూ మంచు దట్టంగా కురుస్తూ ఉంటుంది. గాలి జోరుగా విజృభించి వీస్తూ ఉంటుంది. ఒక్కొక్కసారి మంచుపెళ్ళలు విరిగి పడుతూ ఉండడమో, హిమానీనదాలు వచ్చి ముంచివేయడమో జరుగుతుంది.

ఈ పరిస్థితులకు తట్టుకుని సురక్షితంగా ఉండే ఇళ్ళు కావాలి వారికి. ఇలాంటిచోట కట్టుకునే గృహాలన్నింటిలోకి ఆదర్శప్రాయమైంది స్విస్ ప్రజలు కట్టుకునే ఇల్లు. దీన్ని ఇంగ్లీషులో 'చాలెట్' అంటారు. ఇది గాలి ఏవైపునుంచి ఎంత తీవ్రంగా వీచినా ఫరవాలేదన్నట్టు నలుచదరంగా ఉంటుంది. ఇంక గోడలకు వాడే దూలాలు చాలా మొద్దుగా బలంగా ఉంటాయి. ప్రతి దూలంలోకి గసిగ దింపి అన్నీ బలంగా ఒకదానిని మరొకటి అంటిపెట్టుకుని ఉండేటట్లు చేస్తారు. ఒకవేళ మంచుపెళ్ళ విరిగి పడినప్పటికీ ఈ గోడకి ఏమీ ఢోకా ఉండదు. ఈ ఇంటికప్పు కూడా చిత్రంగా ఉంటుంది. చాలా దిగువకి ఉంటుంది. పైగా వెడల్పుగా ఉంటుంది. మంచు దట్టంగా కురిసినా ఎప్పటికప్పుడు జారి పోవడానికి వీలుగా వాలుగా ఉంటుంది. ఇంటి కప్పుమీద బరువైన నాపరాళ్ళు పరుస్తారు. అప్పటికీ గాలి వేగానికి ఇది ఎగిరిపోకుండా అడుగున ఒక్కొక్కసారి పెద్దపెద్దరాళ్ళు దిగ జారకడతారు. నిజంగా ఈ ఇల్లు ఎంతో వాసయోగ్యంగా హాయిగా ఉంటుంది. శీతకాలమైనా, వేసవికాలమైనా చుట్టూ చూడడానికి కొండల రమణీయదృశ్యం ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది.

ఇంతవరకు మనం కొయ్యఇళ్ళసంగతి ముచ్చటించు కున్నాం. ముఖ్యంగా ఇవి దూలాలతో నిర్మించబడినవి ఇవి కాకుండా కేవలం చెట్లపట్టలతో నిర్మించబడిన ఇళ్ళుకూడా ఉన్నాయి. ఇలాంటిఇంటిని ఇంగ్లీషులో'విగ్ వామ్'అంటారు. ఇవి మన లంబాడీలు వగైరా దేశదిమ్మరిజాతుల ఇళ్ళ వంటివి. వెదురు బద్దలనో, లేక కొమ్మలనో వంచి గుండ్రంగా గూడు అల్లుకొని పైని కప్పుబద్దలు బిగిస్తారు. ఆ బద్దలపైని తాటి చాపనో ఈత ఆకు చాపనో అల్లి కప్పుగా బిగిస్తారు. అవి ఆకుల చాపలైతే అమెరికాలో నివసించిన రెడ్ యిండియన్‌లు చెట్లబెరళ్ళను చేర్చి చాపలుగాకుట్టి ఇంటి కప్పుగా వాడేవారు. దీనిలోపల వారు పడుకోవడానికీ, కూర్చోవడానికీ వీలుగా అన్నివైపులా మట్టితో అరుగులు వేసుకునేవారు. వాటిమీద జంతువులచర్మాలు పరుచుకొని కూర్చునేవారు. ఇలాంటి బెరడుఇళ్ళల్లో చాలాపెద్దవాటిని నిర్మించుకున్నవారు 'ఇరోకాయిన్' తెగవారు. ఇది ఒకొక్కటి నూటవభై అడుగుల పొడుగూ, ఇరవైఅయిదు అడుగులవెడల్పూ ఉండి ఎన్నో సంసారాలు ఏకకాలంలో నివసించడానికి వీలుగావుండేవి. వీరు ఈ కొయ్యఇళ్ళల్లో వంట కూడా చేసుకునేవారు. అమెరికా వాయువ్యతీరంలో ఉండే ఆదిమవాసులు కొయ్యపెట్టెలలో వంటచేయడం ఎలాగో చిరకాలానికి పూర్వమే నేర్చుకున్నారు. వీరు నీటిఆవిరి, వేడి నీటిసాయంతో కొయ్యపలకలను కావలసినరూపంలో వంచి, కటి నారతో చుట్టూ కట్టుబిగించేవారు. ఈ కొయ్యగిన్నెలో నీళ్ళుపోసి, ఉడకపెట్టవలసిన ఆహారం అందులోవేసి ఆ తరు

వాత ఎర్రగా కాల్చిన రాళ్ళను పడవేసేవారు. ఆవేడికి ఆహారం బాగా పచనమైఉండేది. వీరు ఆహారాన్ని తొయ్యపళ్ళెము లలో పెట్టుకుని కొమ్ముచంచాలతో తినేవారు. వీరు తమ గుడిశెలకు ఎదురుగా చిత్రవిచిత్రములైన జంతువుల బొమ్మలు చెక్కిన పొడుగాటి ధ్వజస్థంభాలను తమ కులానికి, తెగకు గుర్తుగా పాతిపెట్టేవారు. అయితే వీరంతా ఇప్పుడు శ్వేత ముఖులకు సన్నిహితులు కావడంతో పాతపద్ధతులకు స్వస్తి చెప్పి నవీన నాగరికతను అలవరచుకున్నారనుకోండి. అది వేరేసంగతి.

ప్రపంచంలో కొన్నిప్రాంతాలలో ఇళ్ళకు దినదిన గండంగా ఉంటుంది. ప్రకృతిమాతకు ఆగ్రహం వచ్చేవరకే అవి నిలిచివుంటాయి. ఆ ఆగ్రహానికి అవి ఎప్పుడు గురిఅయిపో తాయో చెప్పడం కష్టం. ఇలాంటి అపాయకరమైనచోట్ల మనుష్యులు ఎందుకు ఇళ్ళుకట్టుకుంటారు? అంటే దానికి కారణాలు లేకపోలేదు.

ఏక్షణాన్నయినా బద్దలయ్యే అగ్నిపర్వతపు వాలులో ఇళ్ళుకట్టుకోడం ప్రమాదమే కదా. అయితే అగ్నిపర్వతప్రాం తాలలోని నేల చాలా సారవంతంగా ఉంటుంది. అక్కడ పంటలు విపరీతంగా పండుతాయి. ఇటలీదేశంలో అగ్ని పర్వతసానువులమీదనే శతాబ్దాలతరబడిని రైతులు ద్రాక్ష పంట పండించుకుంటూ కాపురంచేస్తున్నారు. అగ్నిపర్వతాలు పేలవనీ, తమ ఇళ్ళు సురక్షితంగానే ఉంటాయనీ ఆశిస్తూనే వారు కాలక్షేపంచేస్తారు. వీరి ఆశలు ఆశలుగానే ఉంటాయి. ఒకొక్కసారి అగ్నిపర్వతాలు విజృంభిస్తూనే ఉంటాయి.

అక్కడి ఇళ్ళూ ద్రాక్షతోటలూ లావాద్రవంలోమునిగిపోయి వాటిమీద టన్నులకొద్దీ బూడిద మేటపడిపోతుంది. పర్వతం చల్లబడిపోయిన తర్వాత మళ్ళీ జనులు అక్కడికి చేరి తిరిగి ఇళ్ళు కట్టుకొని వ్యవసాయం ప్రారంభిస్తారు.

సుమత్రా ద్వీపంలో బటక్ జాతివారు కూడా అగ్ని పర్వతసానువులమీద ఇళ్ళు కట్టుకుంటారు. అవి మంచెల మీద పెట్టిన పడవలలాగ కనబడతాయి. వాటిలో రెండు అంతస్తులు ఉంటాయి.

పరిపాటిగా ఉపద్రవకరమైన వరదలు వచ్చే నదుల ఒడ్డున నివసించడంకూడా ప్రమాదమే. చాలామంది నది ఒడ్డునే ఇళ్ళు కట్టుకొని ఉంటారు. వరద వచ్చినప్పుడు గట్లకు గండ్లుపడి ఇళ్ళు మునిగిపోతాయి. కొట్టుకుపోతాయి. అప్పుడు ఆస్తికీ, ప్రాణాలకీకూడా నష్టం సంభవిస్తూ ఉంటుంది.

పట్టణం మధ్యలో ఎత్తయినచోట ఇళ్ళు కట్టుకోడానికి తగిన డబ్బు లేక కొందరూ నదీప్రాంతంలోనే భూమీ పుట్రా వున్న వాటిని విడిచివెళ్ళడానికి ఇష్టంలేక కొందరూ ఇలా అపాయంలోనే జీవిస్తూవుంటారు. వరద తీసినతర్వాత, తమ యిళ్లు కొట్టుకుపోకుండా నిలిచిఉంటే బురద అంతా ఎత్తి పారవేసి మరమ్మతుచేసుకొని మళ్లీ ఆ ఇళ్ళలోనే నివసిస్తూ ఉంటారు.

హాలండు దేశంలో నేలమట్టం కొన్నిచోట్ల సముద్రపు మట్టంకంటే 20 అడుగులు పల్లంగా ఉంటుంది. సముద్రంవచ్చి దేశాన్ని ముంచివేయకుండా డచ్చివారు మట్టితోనూ, రాతితోనూ, సిమెంటుతోనూ, ఉక్కుతోనూ బ్రహ్మాండమయిన

'డైక్స్' నిర్మించారు. నేలమీద నీటిని గాలి మరల సాయంతో ఒక కాలవలోనుంచి ఇంకొక కాలవలోకి తోడి వేస్తూఉంటారు. ఈ కాలువలు ఒకదానికంటె ఇంకొకటి ఎత్తుగా నిర్మింపబడతాయి. చివరికి నీరంతా సముద్రంలోకి తోడివేస్తూ వుంటారు.

పెద్ద పెద్ద తుఫానులు వీచినప్పుడు బ్రహ్మాండమయిన కెరటాలు లేచి 'డైక్స్'లో గండ్లు పడతాయి. అప్పుడు నేల అంతా ఉప్పునీటితో నిండిపోతుంది. ఇళ్ళు నాశనం అయి పోతాయి. మనుష్యులు చచ్చిపోతారు. ఉప్పెన వచ్చి పాడయిన ప్రాంతాన్ని బాగుచేయడానికి చాలాకాలం పడు తుంది. నేలమీది ఉప్పుఅంతా తొలగిస్తేనే కాని మళ్ళీ పంటలు పండవు.

ఏ క్షణానికి ఎలాంటి గాలి వచ్చి కొంపా గోడీ ఎగర వేసుకుపోతుందో అనే భయంతో ప్రాణాలు గుప్పిట్లో పెట్టు కుని బ్రతకవలసిన ప్రమాదకరప్రాంతాలు మరికొన్ని ఉన్నాయి. వాతావరణం మామూలుగా ఉండేచోట నివ సించేవారికి గాలివానలు చాలా చీకాకు కలిగిస్తాయి. కాని అస్తమానం వాటిమధ్యనే నివసించేవారికి అవి ప్రమాదాలు గానే తోచవు. అలవాటైపోతాయి. గాలివాన వస్తోందని సూచన తెలిసినప్పుడు పొయ్యిమీదికీ పొయ్యిలోకీ కావల సిన సరంజామా అంతా సిద్ధంచేసుకుని కిటికీలతో సహా తలుపులన్నీ మూసుకొని కూర్చుంటారు. గాలివాన వెలిసినతరువాత మామూలుగా బయటికి వచ్చి నిత్య కృత్యాలు సాగించుకుంటూ ఉంటారు. ఇవే కాకుండా

వేసవికాలంలో అగ్నిప్రమాదాలూ, వానాకాలంలో తేమ వల్ల ఇళ్ళు కూలిపోయే ప్రమాదాలుకూడా చాలా జరుగుతూ ఉంటాయి. ఏమైనప్పటికీ ప్రమాదకర ప్రాంతాలలో సైతం ప్రజలు నివసిస్తూనే ఉన్నారు. అలా నివసించడానికి ఎవరి కారణాలు వారి కున్నాయి.

భారతదేశంవంటి సువిశాల దేశంలో ప్రాంతీయ భేదాలు చాలా ఎక్కువ. భాషా భేదాలూ, శీతోష్ణ పరిస్థితులలో భేదాలూ, భూమి తీరులో నిభేదాలూ - చాలా ఉండడంచేత ఇళ్లు అన్నీ ఒక్కరకంగా ఉండవు. దేశం మొత్తం మీద ఎవరు ఎక్కడ ఇల్లు కట్టుకున్నా ప్రతివారూ అక్కడి వాతావరణానికీ, తమ అవసరాలకు, అభిరుచులకూ అనుగుణంగా తీర్చి కట్టుకుంటూ ఉంటారు. మాటవరసకు కాశ్మీరు ప్రాంతాలలోనూ, సిమ్లా, డార్జిలింగ్ వగైరా హిమాలయ పర్వతపాదప్రాంతాలలోనూ శీతకాలంలో మంచు బాగా కురుస్తుంది.

అస్సాములోని చిరపుంజివంటిచోట ఏడాదిలో చాలా భాగం వానలు దిట్టంగా పడుతూఉంటాయి. రాజపుత్రస్థానంలో ఎడారి ప్రభావం ఎక్కువ. మన దేశంలో పర్వతాలమీద కట్టబడిన పట్టణాలూ ఉన్నాయి. సముద్ర తీరాన్ని ఆనుకొని వెలసిన బస్తీలూ ఉన్నాయి చిలకసరస్సు వంటిప్రాంతాలలో నిర్మించబడిన గ్రామాలూ ఉన్నాయి. మనదేశం గడచిన మూడు నాలుగు వందల సంవత్సరాలుగా పరాయివారి ఏలుబడిలో ఉంది. పాశ్చాత్యులకు పూర్వం మొగలాయీలు పరిపాలించారు. అందుచేత మన దేశంలో

కొన్ని కట్టడాలను చూస్తే వాటిలో మొగలుశిల్పంతోపాటు పాశ్చాత్యశిల్పవిన్యాసం కూడా కనిపిస్తుంది. మదరాసులో ఉన్న కొన్నిభవనాలు, కలకత్తాలోని ఫోర్ట్ విలియమ్ కోట అన్నీ ఆంగ్లేయశిల్పానికి ప్రతిబింబాలు. పుదుచ్చేరిలో మనకు ఫరాసుశైలిభవనాలూ, నరసాపురంలో డచ్చిశైలి భవనాలూ, గోవాలో పోర్చుగీసుశైలిభవనాలూ కనబడతాయి. పాశ్చాత్య ప్రపంచంనుంచి వచ్చే యాత్రికులకు భారతసింహద్వారం అనదగిన బొంబాయి నగరంలో మనకు ప్రపంచంలో ఎన్ని దేశాలయితే ఉన్నాయో అన్ని దేశాలకూ సంబంధించిన వాతావరణంతోపాటు ఆయా ప్రజల స్వదేశాలలో నివసించే ఇళ్ళ నమూనాలు కూడా కనబడతాయి. ఉత్తరదేశపు ప్రజలలో పరదాపద్ధతి ఎక్కువ. అందుచేత అక్కడి ఆచారాలకు అనుగుణంగా కిటికీలూ, ద్వారబంధాలూ ఒకదాని కొకటి ఎదురుగా ఉండవు చూచేవారికి ఎప్పుడూ ఒక్క గుహ్యమే కనబడుతుంది. రాయలసీమలో పెంకుటిళ్ళు తక్కువ. నాలుగు అడుగులలోతుకు తవ్వేసరికి నాపరాయి పుష్కలంగా దొరుకుతుంది కనక ఇళ్ళన్నీ నాపరాయి మిద్దెఇళ్లు. కొంచెం వర్షాలు ఎక్కువగా కురిసే కోస్తా జిల్లాలలో ఇళ్ళన్నీ కోసుకప్పుల పెంకుటిళ్ళు. ఇవన్నీ పూర్వోత్తరపు ఇళ్ళసంగతి. ఈనాడు విజ్ఞానం బాగా అభివృద్ధిఅయి దూరం భారం కాకుండాపోవడంలో కూడా కొత్తకొత్తపద్ధతులు వాడుకలోకి వచ్చాయి. కొత్తగా కట్టుకున్న ఇళ్ళు చూస్తే అవి ఒక దేశానికి, ఒక తెగకు ప్రత్యేకమయిన ఇళ్ళు అని చెప్పడానికి

లేదు. ఆరోగ్యరక్షణగురించీ, పారిశుద్ధ్యాన్నిగురించికూడా ప్రజల అభిప్రాయాలలో, అలవాట్లలో చాలా మార్పులు రావడంతో ఆ మార్పులన్నీ ఇళ్ళనిర్మాణంలో ద్యోతక మవుతూవచ్చాయి. ఈనాడు కొత్తగా కట్టబోయే ప్రతిఇంటికి మిగతా ఏవి ఉన్నా లేకపోయినా ఒక స్నానాలగది, ఒక మరుగుదొడ్డి విధిగా ఉండితీరుతున్నాయి. ఇల్లు చూడడానికి చిన్నదయినా ఇమ్ముగా హెచ్చువసతులతో కట్టుకుంటు న్నారు. పూర్వం ఎవరిఇష్టంవచ్చినట్లు వారు ఒక వరుసా వావీ లేకుండా ఇష్టంవచ్చిన పద్ధతిలో ఇళ్ళు కట్టుకుంటూ ఉండేవారు. అప్పుడు ఇళ్ళు ముఖ్యంగా వ్యక్తి అవసరాలకు తగినట్లు నిర్మింపబడేవి. ఆరోజులలో విశాలదృక్పథం తక్కువ కావడంచేత వీధులు వంకరటింకరగా, సందులుగొందులుగా ఉండేవి. ఇప్పుడు పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. ప్రతి చోటా పురపాలకసంఘాలు వెలిశాయి. ఎంతసేపూ తమ ఆరోగ్యం, తమ ఆయుస్సు, తమ భాగ్యం, తమభోగం అనే సంకుచిత దృక్పథానికి ఈనాడు విలువ తగ్గిపోయింది. ఇరుగు పొరుగువారియెడల స్నేహభావం, శుభచింతన ప్రజలలో ఎక్కువ అయింది. గ్రామాలూ, బస్తీలూ, నగరాలూ ఒక క్రమపద్ధతితో విస్తరించేటట్టు చూడడానికి చట్టరీత్యా విశే షాధికారాలు పురపాలకసంఘాలకు సంక్రమింపజేయబడ్డాయి. అందుచేతనే నాడు 'నాకు డబ్బు ఉంది, నాకు స్థలం ఉంది. ఇల్లు నా ఇష్టంవచ్చినట్టు కట్టుకుంటాను' అంటె ఎవరికీ సాగదు. ముందుగా మనం కట్టుకోబోయే యింటి నమూనాను పటం గీచి దాన్ని పురపాలకసంఘంవారి ఆమోదానికి

పంపించాలి. మనం కట్టబోయే ఇంటి బారానికి అక్కడి నేల తట్టుకోగలదో లేదో ముందుగా పరీక్ష చేస్తారు.

మనం కట్టబోయే ఇల్లు ఆ వీధిలోకి ఏ వైపునా దురాక్రమణ లేకుండా ఆ వీధివెంట పోయే జలదారులకు, విద్యుత్తంత్రులకూ, మంచినీటి సరఫరాలకూ, మురుగునీటి కనమాలకూ ఎలాంటి ఆటంకము లేకుండా పారిశుద్ధ్యచట్టం లోని అంశాల దృష్ట్యా అది కనీస అవసరాలతో చిరకాలం వాసయోగ్యంగా ఉంటుందా లేదా అనే దృష్టితో చూస్తారు. కాలంతోపాటుగానే వాస్తుశాస్త్రం కూడా ఎంతో విశేషంగా అభివృద్ధి చెందిందనడానికి నిదర్శనం ఈనాడు ఇంజనీర్లు పాతాళభవనాలనూ, అంబరచుంబితప్రాసాదాలనూ అవలీలగా నిర్మించివేయగలగడం. పూరింటిలో ఉన్నా లేక అమెరికాలోని ఎంపైర్ స్టేట్ భవనంవంటి 120 అంతస్తుల భవనంలో ఉన్నప్పటికీ వాటి ప్రయోజనం ఒకటే. ఇది అంతా ఏడు ముక్కలలో చెబుతా. శీత వాతాతపాలబారి నుంచీ, వానలనుంచీ, వరదలనుంచీ, మంచునుంచీ, దుష్టమృగాల నుంచీ కాపాడుకోడం కోసమే మానవులు ఇళ్ళలో నివసిస్తున్నారు. అంతేకాదు. పనిపాటులు చేసుకొనడానికీ, పరికరాలను దాచుకోడానికీ, వంటచేసుకొని భోజనంచేయడానికీ, పసిపిల్లల్ని సాకడానికీ, వృత్తిధర్మాన్ని నిర్వర్తించుకోడానికీ మానవునికి ఇల్లు కావాలి.

మానవులు తమకు నచ్చినపద్ధతులలో తమ అవసరాలకు తగినట్లు ఇళ్ళు నిర్మించుకుంటూ ఉంటారు. వీటిలో కొన్ని పెద్దవిగా ఉంటాయి. కొన్ని చిన్నవిగా ఉంటాయి.

కొన్ని గుండ్రంగావుంటాయి; కొన్ని చదరంగా వుంటాయి. కొన్ని పొడవుగా వుంటాయి. కొన్ని కోసుగా వుంటాయి. ఒక అంతస్తువీ, రెండు అంతస్తులవీ, మూడు అంతస్తులవీ, ముప్పయి అంతస్తులవీ, నూటఇరవై అంతస్తులవీ కూడా ఉన్నాయి. కొన్నింటి కప్పులు కోసుగా, ఏటవాలుగా ఉంటాయి. మరి కొన్నింటివి బల్లపరుపుగా ఉంటాయి. కొన్ని గుండ్రంగా గిన్నె బోర్లించినట్లు ఉంటాయి. కొన్ని నీళ్ళలోనూ, మరికొన్ని చెట్లమీదా నిర్మింపబడతాయి.

ఆదిమమానవులు నివసించిన గుహలనుంచి ఆధునిక మానవులు నివసిస్తున్న అనేక అంతస్తుల అద్భుత ప్రాసాదాల వరకూ గృహనిర్మాణవిధానంలో కలిగిన పరిణామాన్ని పరిశీలించే సందర్భంలో మనకు టిబెట్‌లో పొగచూరిన ఇళ్ళలో చలికాచుకుంటూ కూర్చోడం ఎలా ఉంటుందో, సేవకులు సదా పరిమళద్రవ్యాలను చిలకరించే ఈజిప్షియన్ శ్రీమంతుల సదనాలు యెలా వుంటాయో, యూరపు నడిగడ్డమీద శత్రుదుర్భేద్యంగా నిర్మించిన శిలాదుర్గాలు శీతాకాలంలో ఎలా గజగజలాడించివేస్తాయో, అడవులలో నివసించేవారి పటకుటీరాల ప్రాంగణంలో వన్యమృగాల కోలాహలం ఎలా ఉంటుందో, ఉష్ణమండలంలో ఉండేఇళ్ళలో ఎండలకు ఎలా వేగిపోతూఉంటారో తెలుసుకున్నాం. అలాగే గుహలలో నివసించే ఆదిమవాసులు అగ్ని ఆరిపోకుండా ఎలా తంటాలుపడేవారో, సరస్సులమధ్య ఇళ్ళు కట్టుకొని నివసించేవారు ముందరుగుమీద కూర్చొని ఆకలి వేసినప్పుడల్లా గేలంవేసి చేపల్ని ఎలా పట్టేవారో, ఆది

వాసులు ఆహారపదార్థాలు ఎలా దాచుకొనేవారో, పడవలో నివసించే చైనాపిల్లలు ఎలాంటి ఆటలు ఆడుకుంటారో, కొయ్యఇళ్ళలో ప్రజలు ఎలా కాపురం చేస్తారో తెలుసుకున్నాం. అలాగే వర్షాలు ఎక్కువగా కురిసేచోట మట్టిఇళ్ళు కట్టితే నిలవవనీ, పూరిళ్ళకంటే కొయ్యయిళ్ళు ఎక్కువ వెచ్చగా ఉన్నప్పటికీ, మట్టిపెళ్ళలకప్పుఇళ్ళల్లో శీతాకాలంలో ఎక్కువ సుఖంగా ఉంటుందనీ. మంచు ఎడారులలో నివసించే ఎస్కిమోలు మంచుఇటుకలతోనే ఇళ్ళు కట్టుకుంటారనీ తెలుసుకున్నాం. గృహనిర్మాణం యేవిధంగా జరిగినప్పటికి అది దేశ కాలాలకు అనుగుణంగా ఉండక తప్పదు. ఎడారిభూములలో కొయ్యఇళ్ళ నిర్మాణం పొసగదు. అడవులలో పర్ణశాలలే తప్ప ప్రాసాదాలు నిర్మించరు. మానవులకు పనిముట్లతో పాటు గృహనిర్మాణకౌశలం పెంపొందుతూ వచ్చింది. గుహలలో నివసించేవారికంటే రాతిపనిముట్లను ఉపయోగించేవారు మంచి యిళ్ళు నిర్మించుకోగలిగారు. రాతిపనిముట్లు కంటె కంచు పనిముట్లను ఉపయోగించగలిగినవారు అంతకంటే కొంచెం మెరుగయిన యిళ్ళను కట్టుకోగలిగారు. తలుపులూ, ద్వారబంధాలూ, బల్లలూ అవీ చేసుకోవడం ఎలాగో వారికి తెలుసు. ఈనాడు రాళ్ళను చెక్కడానికీ, నునుపుచేయడానికీ, మెరుగుపెట్టడానికీ రకరకాల యంత్రాలు వాడుకలోకి వచ్చాయి. వాటిసాయంతో కొండలను పిండిచేయటం, కాకపోతే కావలసిన ఆకారాలుగా చెక్కడం చాలా సులువైపోయింది.

అలాగే సుఖశీతోష్ణసాధనయంత్రాల సాయంతో వాతావరణనియంత్రణం మానవులకు సాధ్యమయింది.



ఆల్ ఇండియా రేడియోకేంద్రం, మైలాపూర్, మద్రాసు.

ఏది ఏమయినప్పటికీ ఒక్క సంగతిమాత్రం నిజం. మనం నివసిస్తున్నది పూరిగుడిసె కానివ్వండి, రాజభవనం కానివ్వండి, అది స్వర్గం కావడమయినా, నరకం కావడమయినా మనం నివసించే తీరుపై ఆధారపడివుంటుంది. గృహమేధి ఆలోచనకు, గృహలక్ష్మి గృహనిర్వాహణ నైపుణికి ప్రతిబింబంగా ఉంటుంది. ఏమయినప్పటికీ ఇల్లు మన సర్వసౌఖ్యాలకు ఆలవాలమయింది. కనుకనే ఇంటివంటి నెలవు మరొకటి లేదన్నమాట అక్షరాలా నిజం.

ఇంతవరకూ ఇళ్ళసంగతి తెలుసుకున్నాం. ఇప్పుడు గుళ్ళూ గోపురాలసంగతికూడా తెలుసుకుందాం. వీటినిర్మాణా

నికి సంబంధించిన శాస్త్రాన్ని వాస్తుశాస్త్రం అంటారు. ఈ వాస్తు శాస్త్ర పరిణామాన్ని పరిశీలించినప్పుడు, మానవ మేధ ఏరీతిగా వికసించిందో మనకు తెలుస్తుంది. మొట్టమొదట గుహాలలో నివసించిన మానవులే కాలం గడచినకొలదీ సుందర శిల్పసంపదకు నిలయమయిన దేవాలయాలను నిర్మించి భగవానునిపట్ల తమ భక్తిశ్రద్ధలను వ్యక్తంచేసిన తీరు మానవ మహోదయానికి మణిముకురం. సాంఘికంగా, నైతికంగా, ఆధ్యాత్మికంగా మానవుని భావపరంపర ఏవిధంగా పరిణతి చెందిందో ఆ క్రమాన్నీ, జీవితం అంటే తరతరాలుగా మానవులలో ఎలాంటి అభిప్రాయాలు కలుగుతూవచ్చాయో ఆ వివరాలనూ, ఆదిమస్థితినుంచి ఆధునికకాలం వరకూ పురోగమనా పథంలో మానవజాతి సాగించిన అవిచ్ఛిన్నయాత్రనూ ఈ వాస్తుశాస్త్రం మనకు కళ్ళకుకట్టినట్టు చూపిస్తుంది. పూరి గుడిసె నుంచి ప్రాసాదం వరకూ నిర్మించడంలో చూపించిన ప్రజ్ఞ మానవులలో సహజంగా దాగివున్న సౌందర్యతృష్ణకూ ఆస్తిక్యభావానికీ నిదర్శనంగా ఉంది. ఏ నిర్మాణం సాగినా ప్రయోజనంతో పాటు అందానికీ, అలంకారానికీ కూడా ప్రాధాన్యం ఇవ్వబడింది. ఏ దేశచరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం? అని ఈసడించిపారవేసేవారికి లలిత కళల సాధనలో మానవుడు సున్నితమయిన బాటలో ఉన్నత శిఖరాలను చేరుకున్నాడన్న సంగతి తెలియదని చెప్పాలి. ఏ దేశచరిత్ర చూచినా కనపడేది ఇదే. భారతదేశంలో సైతం వాస్తుశాస్త్ర వృద్ధి క్షయాలను పరిశీలించినప్పుడు ఈ సంగతే బోధపడుతుంది. క్రీస్తుకుపూర్వం 3,000 సంవత్సరాల

నాటికే భారతదేశంలో వాస్తుశాస్త్రం పూర్తిగా అభివృద్ధి చెందిందని చెప్పడానికి నిదర్శనం మొహెంజొదారో, హరప్పా శిల్పశిథిలాలలో లభించింది. ఇవి ఇప్పుడు పాకిస్తాన్ పాలనలో ఉన్నప్పటికీ నేటిభారతీయనాగరికతకూ, నగరనిర్మాణానికీ ఒరవడికాదగిన ఈ రెండు ప్రాచీననగరావశేషాలూ మహోజ్వలమయిన సింధు లోయ నాగరకత విలసిల్లిననాటివని పండితులు అభిప్రాయపడుతున్నారు. నగర వాస్తు, ప్రజారోగ్య సంరక్షణకు సంబంధించినంతవరకు పాశ్చాత్యదేశాలలో విశేషంగా శాస్త్రీయమయిన పద్ధతులలో అభివృద్ధి జరిగింది అంటారు కాని, మొహెంజోదారో, హరప్పాలను చూస్తే 5,000 సంవత్సరాలకు పూర్వమే భారతీయుల నగరవాస్తు విశేషంగా అభివృద్ధిచెందిందని చెప్పడానికి సందేహంలేదు. ఆ రోజుల్లోనే విశాలమయినరోడ్లూ, దుకాణాలబారులతో కూడిన సందులూ చక్కగా తీర్చిదిద్దినట్లు ఉండేవి. ఇళ్ళన్నీ మిద్దె ఇళ్ళు పై అంతస్తు సాధారణంగా కొయ్యతో నిర్మింపబడేది. పై కప్పు బిళ్ళపెంకులతో నిర్మింపబడేది. ప్రతి ఇంటిలోనూ వీధిని ఆనుకొని స్నానాల గదులు నిర్మింపబడేవి. ఇళ్ళలో వాడిన మురుగునీరు అంతా వీధిలోకి పోయేది. ఈ విధంగా వీధిలో చేరిన మురుగు అంతా ఊరి చివరికి ప్రవహించిపోవడానికి వీలుగా ప్రతివీధిలోనూ ఇటుకలతో నిర్మించిన మురుగుకాలువలు ఉండేవి. ఈ మురుగునీటి కనకులకున్న మరొక ముఖ్యవిశేషం ఏమిటంటే— వాననీరు పోవడానికి వీలుగా పెద్దపెద్ద ఇటుకలతో నిర్మించిన తూములూ, బోదెలూ వగైరాల ఏర్పాటు. ఇళ్ళలోకూడా మురుగునీరు

పోవడానికి ఇటుకలతో కాలువలు నిర్మించేవారు. హరప్పాలో బయటపడిన శిల్పశిథిలాలను బట్టి ఒక యింటికి ఒకదాని తర్వాత ఒకటిగా పదహారు ప్రాకారాలు ఉన్నట్లు తేలింది. బహుశా ఇది బ్రహ్మాండమయిన గిడ్డంగి అయి వుండవచ్చునని అభిప్రాయపడుతున్నారు. మహెంజొదారోలో వీధిమొగలలో ఉన్న కొన్నిరకాల భవనాలకు పక్కనే పీపా గుంటలు ఉన్నాయి. ఇవి బహుశా పానమందిరాలు అయి ఉండవచ్చుననీ, ఈ పీపాగుంటలలో నిండిన పీపాలను భద్రపరచి ఉంచేవారనీ భావించబడుతున్నది. మహెంజొదారోలో బయటపడిన మరొక ముఖ్యమయిన భవనం సువిశాలమయిన స్నానమందిరం.

దీన్ని పూర్తిగా పంచటిటుకలతో నిర్మించారు. ఇరువైపులా నిర్మింపబడిన మెట్లద్వారా దీనిలోకి ప్రవేశించడానికి చక్కని మార్గంవుంది. ఈ స్నానమందిరం పై అంతస్తు మీద పదిమంది నడిచిపోవడానికి వీలుగా పెద్ద రస్తా నిర్మింపబడింది. ఈ రస్తాకు అడుగున ఉన్న గదులన్నీ పూర్తిగా మట్టితో నింపేశారు. ఈ స్నానమందిరం చుట్టూ ఉన్న రహదారిలోకి లోనివారు స్వేచ్ఛగా ప్రవేశించడానికి వీలుగా ఎక్కడికక్కడ తలుపులున్నాయి.

ఆ మందిరానికి ఉత్తరదిగ్భాగంలో ఎనిమిది స్నానాలగదులు ఉన్నాయి. వీటన్నిటిలోనుంచి పై అంతస్తుకు చేరుకోడానికి మెట్లు ఉన్నాయి. బహుశా ఆ కాలంలోకూడా మహెంజొదారో ప్రజలు త్రికాల స్నానాన్ని మతవిధిగా అనుసరించేవారేమో! వేదాలలో దొరికిన ఉదాహరణలను

బట్టి చూస్తే సప్తప్రాకార పరివృతాలయిన దుర్గమ దుర్గాలుగా తమనగరాలనూ, జానపదాలనూ తీర్చిదిద్దుకోడం వేదకాలపు ఆర్యులకు బాగా తెలుసునని చెప్పాలి. ఆరోజులలో ఆర్యులకూ, దస్యులకూ మధ్య తరచు యుద్ధాలు జరుగుతూ ఉండేవి. అయితే ఆర్యులపై కత్తికట్టిన ఈ దస్యులు సింధులోయ ప్రాంతంలో నివసించి హరప్పా, మొహెంజొదారో నగరాల నాటి నాగరికతకు కారకులయినవారే అని గట్టిగా చెప్పడానికి వీలులేకపోతున్నది. వేదకాలపు ఆర్యుల గృహం పెద్ద అట్టహాసం ఏమీ లేకుండా నిరాడంబరంగా నిర్మింపబడేది. చాలా గదులున్న పర్ణశాలలో నివసిస్తూ ఉండేవారు ఆనాటి ప్రజలు. మధ్యను ఒక పెద్దహాలూ, దాని చుట్టూ భోజనశాలా, కొట్టుగదీ, పడకగదీ, అతిథిమందిరం అన్నీ ఉండేవి. వేద వాఙ్మయంలో సమాధిదిబ్బల ప్రస్తావన కూడా చాలా ఉంది. ఈ సమాధిదిబ్బలే తరువాతికాలంలో భారతీయ శిల్పం విశేషంగా వృద్ధి చెందడానికి ఎంతో ప్రోత్సాహం ఇచ్చాయి. అవే తరవాత చరిత్ర ప్రసిద్ధమయిన స్తూప నిర్మాణానికి దారితీశాయి. ఆ తరవాత వెలువడిన భారతీయ పురాణాలలోనూ, బౌద్ధ వాఙ్మయంలోనూకూడా సుందరంగా నిర్మించిన నగరాలనుగురించీ, సువిశాలములయిన రాజప్రాసాదాలను గురించిన ప్రస్తావన చాలా ఉంది. ఆ పట్టణాల నిర్మాణం చాలావరకు పాటలీపుత్రనగరపు నమూనాలో జరిగినట్టు భావించబడుతోంది. ఆరోజులలో పాటలీపుత్రనగరం ఐకోసుగా డైమన్ చుక్కవలే సమానాంతరచతుర్భుజం ఆకారంలో ఉండేది. ఎత్తయిన బురుజులూ, లోతైన కందకమూ

ఉండేవి. మొత్తం 64 సింహద్వారాలు ఉండేవి. రాజప్రాసాదం సువిశాలమై శిల్పసంపదకు ఆకరమైన పెద్దపెద్ద చావళ్ళతో శోభాయమానంగా ఉండేది. ఆ తరువాతి కాలంలో పేర్కొనదగినవి అశోకచక్రవర్తి కాలంలో వర్ధిల్లిన శిల్ప ఖండాలు. ప్రాచీన పాటలీపుత్రంలో ప్రధానంగా కానవచ్చేది దారుశిల్పమే అయినప్పటికీ అశోకునికాలంనాటికి మొదటి సారిగా మనకు శిలాశిల్పాలు కనపడతాయి. అశోకుని పేరు చెప్పగానే మనకు జ్ఞాపకంవచ్చేవి రాతిస్తంభాలమీద ఆయన చెక్కించిన ధర్మశాసనాలు. ఆకాలంనాటి కంబాలలో కడు ప్రసిద్ధమయినది సార్నాథ్ స్తంభం. దాని శిఖరామలకం సుందరమయింది. ఒక పద్మం, పద్మంమీద పళ్ళెం, పళ్ళెం మీద గుండ్రనిఅరుగూ, ఆ అరుగుచుట్టూ ధర్మచక్రం, దానికి నాలుగువైపులా ఏనుగు, గుర్రం, ఎద్దు, సింహం, అరుగుమీద చతుర్ముఖ సింహతలాటం ఎంతో అందంగా చెక్కబడ్డాయి. ఈ రాతి స్తంభాలు నిగనిగలాడుతూ ఉండేటట్లు నున్నగా మెరుగుపెట్టబడ్డాయి. బరాబర్ కొండలలో అశోకునికాలంలో నిర్మింపబడ్డ కొన్ని చావళ్ళు ఉనికి కనుగొనబడింది. ఇందులో సుదామగుహలోని అర్ధచంద్రాకారపు చావడి మనోహరమయింది. పాటలీపుత్రం కోటలో అశోకుని రాజభవనం నిర్మాణం పెర్సిపోలీస్ పట్టణాన్ని పరిపాలించిన ఎకిమినీడ్ రాజుల స్తంభాల చావళ్ళ నమూనాలో నిర్మింపబడినట్లు భావించబడుతున్నది. అశోకునినాటినుండి క్రీస్తు తరవాత 20 వ సంవత్సరంవరకూ దాదాపు మూడుశతాబ్దాల పర్యంతం అశోకునికాలంనాటి శైలిలోనే భారతీయ

శిల్పం బాగా వృద్ధిచెందింది. గుహలను మలచి రాతికి సుందర రూపకల్పనచేసే కృషి నాటికే పరాకాష్ఠచెందిన దనడానికి నిదర్శనం పూనా సమీపంలోని భజ విహారం. ఇందులో ఐరావతీ వాహనారూఢుడైన ఇంద్రుని చిత్రం ఎంతో మనోహరమయిందని విమర్శకులు ఎలా ఏకగ్రీవంగా మెచ్చుకున్నారో అలాగే కార్లేగుహలోని చైత్యమందిరం భారతీయుల గుహాశిల్పచాతుర్యానికి తార్కాణంగా ప్రేక్షకుల హృదయాలలో శాశ్వతస్థానాన్ని సంపాదించుకుంది. బార్హాత్ స్తూపం క్రీస్తుకు పూర్వం 15 సంవత్సరాల ప్రాంతంలో నిర్మించబడిందని చరిత్రకారుల అభిప్రాయం. ఇందులో సింహద్వారాలూ, స్తూపానికి ఆవరణగా నిర్మించిన రాతి కంచె స్తంభాలూ కూడా సుందర శిల్పసంపదకు తావలం. ఇక్కడి సింహద్వారాలు యక్షులూ, యక్షిణులూ, సర్పాలూ, లతావితానాలు మాత్రమే కాకుండా బుద్ధుని జాతకకథలకు సంబంధించిన దృశ్యాలతోకూడా అలంకరింపబడ్డాయి. వీటిలో మనకు బుద్ధుడు ఎక్కడా కనపడకపోయినా బుద్ధుని జీవితఘట్టాలు మాత్రం సంజ్ఞారూపంగా వివరించబడ్డాయి.

గయలో బోధివృక్షం దగ్గర నిర్మింపబడ్డ దేవాలయం విశిష్టమయినది. ఇది నాలుగు శతాబ్దాలలో వర్ధిల్లిన శిల్ప సాంప్రదాయాల సుందర సమ్మేళనం అని చెప్పవచ్చు. సాంచీ స్తూపాలు ఒక ప్రత్యేకకాలానికి చెందినవి కావు. ఇక్కడి మొదటిస్తూపం తాలూకు లోతట్టు నిర్మాణం మౌర్యుల కాలంలో జరిగిఉండవచ్చు. రెండు మూడు స్తూపాలు సుంగ

వంశపు రాజులకాలంనాటివి. ఈ స్తూపాలలో మొదటి మూడవవాటి సింహద్వారాలు శాతవాహనులకాలంనాటివి. రెండవ స్తూపంలోని శిల్పాలు బాగ్‌హోత్ శైలికి చెందినవి. కొన్నింటిలో బాక్ట్రియన్ గ్రీకు సాంప్రదాయాల ఛాయలు కనబడతాయి. ఏమయినప్పటికీ వీటిని భారతీయశిల్పాల మహోజ్జ్వల నైపుణ్యానికి నిదర్శనాలుగా భావించుకోవడం సమంజసం. ముఖద్వారానికి చెందిన వాసాలమీద ఉన్న చెక్కడపుపని కంటికి ఇంపునూ, మనస్సుకు వికాసాన్నీ సమకూర్చగల రీతిగా తథాగతుని కథలూ, గాథలూ మనోహరంగా చెక్కబడాయి. ముఖ్యంగా ఇక్కడితోరణశిల్పవైభవం అపూర్వమయింది. తక్షశిలలోనూ, తదితర ప్రాంతాలలోనూ పురాతత్త్వశాఖవారి తవ్వకాలవల్ల బయలుపడ్డ శిల్పాలను చూస్తే క్రీస్తుశకం రెండుమూడు శతాబ్దాలలో భారతీయ శిల్పకళా పరిణామాన్ని తెలుసుకోవచ్చు. అక్కడి విహారాలలో నిర్మాణమంతా భారతీయ శైలిలోనే జరిగినప్పటికీ లోపలి అలంకరణ మాత్రం తదాభాస అని చెప్పవచ్చు. గాంధార విహారాలు సాధారణంగా రెండుభాగాలుగా నిర్మింపబడ్డాయి. అందులో ఒకటి స్తూపం. రెండవది విహారంలోని మిగతాభవనాల కూటం. దక్షిణాపథంలో ఆకాలంలో వర్ధిల్లిన మరొక మహావిహారం మన గుంటూరుజిల్లాలోని అమరావతి. ఇది ఆదిలో క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దంలోనే నిర్మింపబడినప్పటికీ క్రీస్తుశకం రెండుమూడు శతాబ్దాలలో దానిచుట్టూ శిల్పసుందరమయిన ప్రాకారాలు నిర్మింపబడ్డాయి. పుష్పమాలలూ, జాతకకథలూ,సుందరభవనాలూ,

ప్రతిరూపాలూ ఎన్నో పిట్టగోడలమీద చెక్కబడ్డాయి. అమరావతీ శిల్పుల కళానైపుణ్యం భారతీయ శైలిసాంప్రదాయానికి పరాకాష్ఠ. గుప్తరాజులకాలం భారతదేశచరిత్రలో సర్వథా స్వర్ణయుగంగా భాసిల్లింది. క్రీస్తుశకం 320 నుంచి 650 వరకూ గల కాలంలో దేవాలయశిల్పం జాతీయకళగా వర్ధిల్లింది. దేశంలో ఏ మూలకు పోయినా మనకు గుప్తరాజుల కాలంనాటి శిల్పకళాసాంప్రదాయాలకు చెందిన గుళ్ళూ, గోపురాలూ చాలా కనబడతాయి. వాటన్నిటిని గురించీ పేరుపేరునా చెప్పడం అసాధ్యం కనక వాటిలో ముఖ్యమయిన కొన్నిటినిగురించి మాత్రమే ముచ్చటిస్తాను. ఆనాటి బౌద్ధస్తూపాలలో ప్రత్యేకంగా చెప్పుకోవగింది కాశీదగ్గరి సార్నాథ్‌లోని ధమేకస్తూపం. ఇది క్రీస్తుశకం 6 వ శతాబ్దంలో నిర్మింపబడిందని ప్రతీతి. ఇక్కడి విశేషం వీటి గోడల మీద చెక్కబడిన లతావితానాలు. ఇవి ఎక్కడా ఒంపూ టొంపూ లేకుండా సొంపుగా తీర్చిదిద్దబడినట్లు ఉంటాయి. అజంతాగుహాలలో 16, 17, 19 గుహాలలో రాతికంబాల సౌందర్యం జగత్ప్రసిద్ధం. 19 వ గుహాలో ఉన్న చైత్యవాతాయనాలు, వాటి చూరులమీద రెండువరుసలుగా చెక్కిన చెక్కడాలూ మనల్ని ఇట్టే ఆకర్షిస్తాయి. మిద్దె కప్పు ఉండే కంబాల మంటపాల గుళ్ళసంగతి వచ్చినప్పుడు సాంచీలోను, భూమారాలోనూ ఉన్నవాటిసంగతి చెప్పాలి. భూమారాలోని శైవదేవాలయం ఈవిధంగా మిద్దె తరగతికి చెందినది. దీనిలోని వాతాయనాలచుట్టూ అందమయిన చెక్కడపుపని చాలా ఉంది. బుద్ధగయలోని మహాబోధి

దేవాలయం ఇటీవలనే పునరుద్ధరింపబడినప్పటికీ తొమ్మిది అంతస్తుల శిఖరంతో ఇది గుప్తకాలంనాటి శిల్పం సాంప్రదాయాలకు చిహ్నంగా నిలిచింది. గుప్తుల కాలంలో రాజప్రాసాదాలన్నీ దారునిర్మితమైనవి. ఈ భవనాలు సాధారణంగా ఒకటి రెండు అంతస్తులతో ఉండేవి. వీటి పైకప్పు బల్లపరుపుగా గాని, కోసుగా గాని ఉండేది. ప్రతి చావడిలోనూ స్తంభాలు చాలా ఉండేవి. ఈ భవనాలలోపల గోడలమీదా స్తంభాలమీదా శిల్పాలంకరణం చాలా హెచ్చుగావుండేది. ఇందులోనే ఒక సంగీతభవనం, ఒక చిత్రశాలకూడా ఉండేవి. అయితే ఈ దారుప్రాసాద సాంప్రదాయం కాలవాహిని తాకిడికి తట్టుకోలేక అంతరించిపోయింది. గుప్తరాజుల తరవాత భారతీయశిల్పకళను బహువిధాల దోహదంచేసినవారు దక్షిణాదిని చాళుక్యులూ, రాష్ట్రకూటులూ, పల్లవులూ, ఉత్తరాదిని పాలభూపతులు. ఏడవ శతాబ్దిలో నలంద విశ్వవిద్యాలయము ఉచ్ఛదశలో ఉండేది. దీనిచుట్టూ ఇటుకప్రాకారాలు నిర్మింపబడ్డాయి. సింహద్వారం దాటగానే పెద్దచావడి కనబడుతుంది. దీనికి అటూ ఇటూ మిగతా చదువుల చావళ్ళు ఉండేవి. ఖగోళ వేధ చేసి గ్రహగతులు తెలుసుకోడానికి వీలుగా ఇక్కడ ఒక పరిశోధనాలయం ఉండేది. ప్రాంగణంలో పురోహితుల కోసం ప్రత్యేకమయిన గదులు ఉండేవి. ఇక్కడ స్తంభాలు అందమయిన చెక్కడాలతో పూర్తిగా నిండి ఉండేవి. అయహోల, పత్తాదకల్, బాదామి దేవాలయాలు పూర్వ చాళుక్య శిల్పసంప్రదాయాలకు మంచి నిదర్శనం. పత్తాదకల్‌లోని మహా విరూపాక్ష దేవాలయాన్ని త్రిభువన

శిల్ప బిరుదాంకితుడయిన గుండాచార్యులు నిర్మించినట్లు ప్రతీతి. బాదామిలోని వైష్ణవదేవాలయ మంటపం స్తంభాల మీాది మానవమూర్తుల శిల్పం అతిలోక రమణీయంగా ఉంది.



*ఎల్లోరాగుహలలో 11 వది; కైలాసాలయం.*

రాష్ట్రకూటులలో రెండవ కృష్ణ చక్రవర్తి ఎల్లోరాలో కైలాస దేవాలయాన్ని నిర్మింపజేశాడు. రామణీయకతలో, శిల్పవైభవంలో దాని కదే సాటి. ఇది క్రీస్తుశకం **757 - 783** కాలంలో నిర్మించబడింది. ఈకాలంలో నిర్మింపబడినవే బొంబాయిసమీాపంలోని ఎలిఫెంటాలోని శైవ దేవాలయాలు. ఇక్కడ మనకు నిర్మాణచాతురికంటే ఎక్కువగా కానవచ్చేది శిల్పవైభవం.

ప్రపంచ ప్రసిద్ధిపొందిన త్రిమూర్తి శిల్పం ఇక్కడిదే. మన పోస్టుకార్డుమీదా, ముక్కానిబిళ్ళలమీదా ఉండే త్రిమూర్తిచిత్రం ఇక్కడి శిల్పానికి ప్రతిరూపమే. దక్షిణాదిని క్రీస్తు శకం 600 నుంచి 700 వరకూ పరిపాలించిన పల్లవ ప్రభువులు శిల్పవిద్యను ప్రోత్సహించి వాసికెక్కినవారు. క్రీస్తు శకం 7 వ శతాబ్ది తొలిపాదంలో నిర్మింపబడిన ఏకాండ శిల్పఖండాలు మనకు మహాబలిపురంలో చాలా కనబడతాయి. ఇక్కడ పాండవరథాలు ఇలాంటివే.

ఆనాటి శిల్పులు చెక్కిన దేవతావిగ్రహాలూ, మానవమూర్తులూ నేటికీ సజీవవిగ్రహాలవలె చూపరులకు ఆనందాన్ని కలిగిస్తాయి. పల్లవరాజులు నిర్మించిన మరొక ప్రసిద్ధ దేవాలయం కైలాసనాథ దేవాలయం. దీని గాలిగోపురం, మండపం చుట్టూ చాలా గదులు ఉన్నాయి. కాంచీపురానికి శోభ తెచ్చిన దేవాలయాలలో ఇది ఒకటి. క్రీస్తుశకం 40 వ శతాబ్దంనుంచి 14 వ శతాబ్దం వరకూ భారతదేశ శిల్పచరిత్రలో మధ్యయుగం అని చెప్పవచ్చు. ఈ యుగంలో కేవలం శిల్పసౌందర్యానికి తావైనయిన దేవాలయాలు లెక్కకు మిక్కిలిగా బయలుదేరాయి. నాడు దేశాన్ని పరిపాలించిన పాలరాజులు, చాళుక్యులు, చోళులు, గంగులు, రాజపుత్రులు—తమ తమ అభిరుచులకు అనుగుణమయిన శిల్పసాంప్రదాయాలను విశేషంగా ఆదరించారు. ఇందులో ముఖ్యమయినవి గుండ్రంగా, పొడవుగా, కోసుగా, ఉండే శిఖరాలు. ఉత్తరదేశంలోనూ, దీర్ఘ చతురస్రమయిన ప్రాతిపదికపై త్రిభుజంవలె పైకి పోను పోను సన్నబడే

గోపురాలు దక్షిణాదినీ, ఈ ఉభయలక్షణాలను మేళవించు కొన్న శిల్ప సాంప్రదాయం మధ్యభారతదేశంలోనూ బాగా వ్యాప్తిలోకి వచ్చాయి.

ఖజురాహోలోని కాందర్య మహా దేవాలయం క్రీస్తు శకం 950-1050 మధ్య నిర్మింపబడింది. నేటి మధ్యభారత్ రాష్ట్రంలో ముఖ్యంగా ప్రజాదరణకు పాత్రమయిన గొప్ప దేవాలయం ఉదయేశ్వరుని గుడి. ఇది క్రీ. శ. 1059-1080 మధ్య నిర్మింపబడింది. గుజరాత్ లోని దేవాలయాలన్నీ తోరణ సౌందర్యానికి బాగా పేరుపడినవి. ఇట్టివాటిలో ప్రధానంగా చెప్పబడింది 1093 లో శ్రీ సిద్ధరాజా సిద్ధాపురంలో నిర్మించిన రుద్రమ్మగుడి. ఆబూపర్వతాగ్రంమీద 1032 ప్రాంతంలోనిర్మింపబడిన జైనదేవాలయాలశిల్పసంపద అపూర్వమయింది. ఇవి పూర్తిగా పాలరాతితోనిర్మింపబడినవి. ఇవి ఆనాటి భారతీయశిల్ప నైపుణ్యానికీ, సుందరభావనకూ సజీవచిహ్నాలని కజిన్సవంటి కళాభిమాని మెచ్చుకున్నాడు. ఒరిస్సాలో 8 వ శతాబ్ది లగాయతు 13 వ శతాబ్దివరకూ గల మధ్య కాలంలో నిర్మింపబడిన దేవాలయాలన్నీ నాగరికశైలికి నిలయాలు. పరశురామేశ్వర దేవాలయం, లింగరాజదేవాలయం, కోనార్క దేవాలయం ఈ శైలికి నిదర్శనాలు. ఉత్తర చాళుక్యశైలికి చెందిన దేవాలయాలు మనకు విశేషంగా ధార్వాడ్ లోనూ, మైసూరులోనూ, దక్కనులోనూ కానవస్తాయి. 16 వ శతాబ్ది తరవాత రాజపుత్రస్థానాన్ని పరిపాలించిన హిందూరాజులు రాజపుత్రస్థానంలోనూ, బుందేల్ ఖండ్ లోనూ దివ్యభవనాలను నిర్మించారు. రాజా మాన్

సింగ్ గ్వాలియర్‌లో నిర్మించిన భవనంయొక్క సింహద్వారాలు అద్భుతంగా ఉంటాయి. 17 వ శతాబ్దిలో బీర్‌సింగ్ దాటియాలో నిర్మించిన మహాప్రాసాదం హిందూ శిల్పసంపదకు కాణాచి. 17 వ శతాబ్దిలో నిర్మింపబడ్డ అంబర్ భవనం, జోధ్‌పూర్‌కోట రాజపుత్రశిల్పానికి నిదర్శనం. దక్షిణదేశంలోనైతేం క్రీ. శ. 850 - 1000 మధ్య చోళ, పాండ్య, విజయనగర రాజులూ, మధురను పాలించిన తెలుగు నాయక రాజులూ దేవాలయ శిల్పకళను విశేషంగా ఆదరించి ప్రోత్సహించారు. శ్రీరంగం, చిదంబరం, కుంభకోణం వగైరా దక్షిణాది పట్టణాలలో ఈనాడు మనకు కనబడే మహా గోపురాలన్నీ పాండ్యరాజులకాలంనాటివి. ఇందులో విశేషం ఏమిటంటే ఈ గోపురాలముందు గర్భగుడి ఎంతో చిన్నదిగ కనబడుతుంది. విజయనగర రాజులకాలంలో ప్రఖ్యాతమయిన సహస్రమంటప నిర్మాణానికి సంబంధించిన శిథిలావశేషాలు కాంచీ, హంపి, విజయనగరంవంటిచోట్ల కనబడతాయి. విజయనగర సాంప్రదాయానికి చెందిన దేవాలయాలలో ప్రధానమయింది విఠోబా దేవాలయం. దీని నిర్మాణం 1565 లో పూర్తిఅయింది. 17 వ శతాబ్దంలో మధురానగరాన్ని పరిపాలించిన నాయకరాజులు గొప్పభవన నిర్మాతలు. వీరిలో తిరుమల నాయకుడు మీనాక్షీ దేవాలయానికి ఎదురుగాఉన్న మైదానంలో వసంత మంటపాన్ని నిర్మించాడు. 12 వ శతాబ్ది చివర దేశాన్ని ఏలుబడిలోకి తెచ్చుకున్న మహమ్మదీయ సామ్రాట్టులు ఒక రకం శిల్ప సాంప్రదాయాన్ని ఈ దేశంలో ప్రవేశపెట్టారు.

అంతకుపూర్వ్యం మే దేశంలో ఒక రకం సాంప్రదాయం అమలులో ఉండేది పాత కొత్తల మేలి కలయికవల్ల మనకు నేటి ఇస్లామిక్ శిల్ప సాంప్రదాయం లభించింది. దీనికి ప్రేరణ సిరియా, ఈజిప్టు, ఉత్తర ఆఫ్రికా, పర్షియా దేశాల శిల్ప సాంప్రదాయాలనుంచి లభించింది. అయితే ఈసాంప్రదాయం కేవలం విదేశీయముగుండి కాకుండా జాతీయమయిన వ్యక్తిత్వాన్ని కూడా సంతరించుకుంది. క్రీ. శ. 1200-1550 మధ్య ఢిల్లీలో మహమ్మదీయ రాజులు, చరిత్ర ప్రసిద్ధమయిన మసీదులు పెక్కింటిని నిర్మించారు. వీటిలో జుమా మసీదు 1791 లో కుతుబ్ ఉద్ దీన్ ఐబక్ నిర్మించాడు. ఇందులో కొన్ని హిందూ సాంప్రదాయాలు కూడా ఉన్నాయి.


కుతుబ్ మీనార్; ఢిల్లీ.

1230 లో ఇల్‌టుట్‌మిష్ దీనివిస్తీర్ణాన్ని రెట్టింపు చేశాడు. అల్లాఉద్దీన్ దీన్ని బాగా అభివృద్ధిచేశాడు. ఈ మసీదునుగురించి ముఖ్యంగా చెప్పుకోదగింది కుతుబ్ మీనార్. తుగ్లక్ రాజుల కాలంలో ఉత్తరాది శిల్ప సాంప్రదాయంలో

గొప్ప మార్పు వచ్చింది. వైవిధ్యోపేతమయిన, ఆడం బరపూరితమయిన అలంకారాలకు బదులు ఒక విధమ యిన గాంభీర్యానికి ప్రాధాన్యం వచ్చింది. గయాజుద్దీన్ సుల్తాన్ నిర్మించిన తుగ్లకాబాద్ పట్టణం ఇందుకు నిదర్శనం. తుగ్లక్ రాజులలో పట్టణాలూ, కోటలూ, సమాధులూ-పెక్కింటిని నిర్మించి ప్రఖ్యాతి కెక్కినవాడు ఫిరోజ్ షా. ఈయన జాన్‌పుర్ నగరాన్నే కాకుండా ఢిల్లీ సమీపంలో 120 విశ్రాంతిమందిరాలతో ఫిరోజాబాద్ కోటను కట్టించాడు.

ఈ నిర్మాణాలన్నీ ఒక్కలాగే ఉండి చూడడానికి విసుగుపుట్టిస్తూ ఉంటాయి. ఫిరోజాబాద్ నగరంలో మనకు సందర్శనయోగ్యమయినది జామా మసీదు. ఈ మసీదుకు ఉన్న అశోక స్తంభం అంబాలా జిల్లాలోని తోరానుంచి తెప్పించబడింది. మీరట్ జిల్లానుంచి తెప్పించిన మరొక స్తంభం కుష్క్-షికార్ భవనంలో ప్రతిష్ఠింపబడింది. ఫిరోజ్ షాకు ప్రధానిగా పనిచేసిన ఖాయీ జహాఁ తెలింగానీ సమాధి నిజాముద్దీన్ ఔలియా దర్గాకు కొంచెం దక్షిణంగా ఉంది. ఈయన తరవాత ఢిల్లీని పరిపాలించిన సయ్యద్, లోడీ రాజుల కాలంలో భవన నిర్మాణ ప్రసక్తి విశేషంగా లేకపోయింది. ఈవిధంగా ఢిల్లీలో మహమ్మదీయ శిల్పం వృద్ధిచెందుతూ ఉండగా రాష్ట్రాలలో స్థానిక సాంప్రదాయాలు స్వతంత్రబాణీలో వృద్ధిచెందుతూవచ్చాయి. 13 వ శతాబ్ది ప్రారంభంలో మహమ్మద్ భక్తియార్ ఖాన్ బెంగాలును జయించిన సమయంలో దేశమంతటా ఇటుకలు కొయ్య, వెదురుతో గృహనిర్మాణం సాగేది. అల్లాఉద్

దీని ఖిల్జీ గుజరాతుమీద దండెత్తిన సమయంలో సుందర మయిన శిల్ప సాంప్రదాయాలు పాటింపబడుతూ ఉండేవి. 14 వ శతాబ్దిలో ప్రారంభమయిన గుజరాతీ ముస్లిమ్ శిల్ప సాంప్రదాయం అహమ్మద్ షా రాజ్యానికి వచ్చేవరకు బాగా వృద్ధిచెందలేదు. కాని ఆయన అహమ్మదాబాద్ లో నిర్మించిన జామా మసీద్, తీన్ దర్వాజా వంటి వాటిలో పరాకాష్ఠ చెందింది. రెండవ మహమ్మద్ షా గుజరాతును పరిపాలించే సమయంలో సార్ ఖేజ్ వద్ద నిర్మింపబడిన షేక్ అహమ్మద్ సమాధి చాలా గొప్పది. మహమ్మద్ బైగ్రా గుజరాతును పాలించే సమయంలోనే జునాగఢ్, ఖేదా, చంపానర్ నగరాలు కొత్తగా నిర్మింపబడ్డాయి. అహ్మదాబాద్ నగరం విశాలమయిన వీధులతో, రమణీయమైన కట్టడాలతో సుందరంగా తీర్చి దిద్దబడింది. చంపానర్ లో కట్టబడిన జుమా మసీదు గుజరాతులోని మసీదు లన్నిటిలోకి తలమానిక మయింది అహమ్మదాబాదులోని సర్ ఖేజ్ భవనం ఈయన శిల్పకళాభిమానానికి మంచి నిదర్శనం. అహమ్మదాబాద్ లోని రాణీ సిప్రీ మసీదు శిల్పసంపద ప్రపంచంలో మరెక్కడా మనకు కానరాదని ఫెర్గూసన్ అంతటివాడు మెచ్చుకున్నాడు. కుండూలోని హిందోలా భవనం T ఆకారంలో ఉంది. ఇందులో పై రెండు అంతస్తులూ జనానాకోసం ప్రత్యేకంగా నిర్మింపబడిన అంతఃపురం. వారణాసి పట్టణానికి సమీపంలోవున్న జాన్ పుర్ లో అటాలామసీదు 1377 లో షార్కీ రాజుల కాలంలో నిర్మింపబడింది. ఇది ముఖ్యంగా తుగ్లక్ సాంప్రదాయాన్ని పుణికిపుచ్చుకున్నట్టు కనిపిస్తుంది.

ఇక మనం దక్షిణాపథానికి వస్తే ఢిల్లీ సామ్రాజ్యా నేలకొన్న సమయంలో దక్షిణాదిని కట్టడాలన్నీ తుగ్లక్ సాంప్రదాయంలోనో, 'ఖిల్జీ సాంప్రదాయంలోనో కట్ట బడ్డాయి. 1347 తరవాత దక్షిణాపథాన్ని పరిపాలించిన ఖిల్జీరాజులు సైతం పర్షియన్, యూరపియన్ సాంప్రదాయాల మేలి కలయికగా భాసిల్లిన ఢిల్లీ సామ్రాజ్య సాంప్రదాయాలనే పాటిస్తూ వచ్చారు.

గోల్కొండలోని జుమ్మా మసీదు దౌలతాబాదుకోట, బీదర్‌లోని అమర్ వలీషా సమాధి ముఖ్యంగా చెప్పకో దగినవి. ఈ సమాధిభవనంలో లతాలంకరణతో పాటు బంగారురంగులో పెక్కు శాసనాలు కూడా చెక్కబడ్డాయి.

1472 లో మహమ్మద్ గవాన్ బీదర్‌లో కట్టిన కళాశాల భవనాలలో ఒక మసీదు, ఒక గ్రంథాలయం, పాఠాల గదులు, ఉపాధ్యాయుల వసతిగృహాలు, విద్యార్థుల గదులు కూడా ఉన్నాయి. ఏమయినప్పటికీ మొగలురాజుల కాలంలో భారతీయశిల్పసంప్రదాయం విశేషంగావృద్ధిచెందిం దని చెప్పకతప్పదు. అయితే బాబరు, హుమాయూన్ చక్రవర్తుల కాలంలో ఇది విశేషంగా అభివృద్ధిచెందినప్పటికీ సయ్యద్ ఆఫ్ఘన్ కాలంలో మాత్రం సుందరభవనాలు కొన్ని వెలిశాయి. ససారంలో నిర్మింపబడిన షేర్ షా సమాధి ఆ మహారాజు ప్రతిభకూ, ఆ శిల్పి నిర్మాణచాతురికీ నిదర్శనం.

అక్బరు రాజ్యానికి రావడంతోనే భవననిర్మాణ కార్యక్రమానికి విశేష ప్రాధాన్యం లభించింది. ఢిల్లీలోని హుమాయూన్ సమాధి, ఆగ్రా లాహోర్ కోటలు ఈ

కాలంలో నిర్మింపబడిన గొప్ప కట్టడాలు. ఆగ్రాకు 26 మైళ్ళ దూరంలోఉన్న ఫతేపుర్ సిక్రీ పట్టణం అక్బర్ భవననిర్మాణ ప్రతిభకు గొప్ప నిదర్శనం. అక్కడిభవనాలలో ముఖ్యమయి నవి బీర్‌బల్‌గృహం, దివాన్ ఇ ఖాన్ భవనాలు.ఆతరువాత చెప్పదగింది జుమామసీదు. అక్బర్ తరవాత మొగలు సింహా సనాన్ని అధిష్టించిన జహంగీర్ సుందరభవన నిర్మాణంతో ఆరామనిర్మాణానికికూడా ప్రాధాన్యం ఇచ్చాడు. కాశ్మీర్ రాజధానిశ్రీనగర్ సమీపంలోని షాలిమార్‌బాగ్ ఈనాటికీ జహంగీర్ సౌందర్యతృష్ణకు నిదర్శనంగా నిల్చిఉన్న రమ ణీయోద్యానం. జహంగీర్‌కాలంలో నిర్మింపబడిన భవనాలలో చెప్పుకోదగినది అక్బర్ సమాధి. లాహోర్‌లోని జహంగీర్ సమాధి, ఆగ్రాలోని ఇత్మద్‌ఉద్‌దౌలా (నూర్జహాన్ తండ్రి సమాధి చెప్పకోదగినవి. ఇందులో ఈ ఇత్మద్‌ఉద్‌దౌలా సమాధి భవనం పాలరాతితో మొగలుశిల్పసాంప్రదాయానికి సజీవచిహ్నంగా నూర్జహాన్ పితృభక్తికీ, సౌందర్యాభినివేశా నికీ తార్కాణంగా నేటికీ నిలిచిఉంది. ఆ తరువాత రాజ్యా నికివచ్చిన షాజహాన్ చక్రవర్తి ఎర్రరాతిభవనాలను చూచి విసుగెత్తిపోయి, రాజపుత్రస్థానంలోని మక్రానా గనులనుంచి త్రవ్వి తీసుకువచ్చిన చలవరాళ్ళు పరిపించి వాటిని సుందర తరమయినవాటినిగా మార్పించివేశాడు. ఆయన కొత్తసాం ప్రదాయాలనుకూడా పెక్కింటిని ప్రవేశపెట్టి ఆగ్రాలో దివాన్ ఇ ఆమ్, దివాన్ ఇ ఖాన్, మోతీమసీదువంటి సుందరమయిన కట్టడాలను చాలా నిర్మించాడు. ఇంతతో తృప్తిపడకుండా షాజహాన్ ఢిల్లీలో ఒక నూతన నిర్మాణం

నిర్మించడానికి పూనుకున్నాడు. ఈయన మూడు సింహద్వారాలూ, బారకీసులూ, ఉద్యోగులకోసం ప్రత్యేక భవనాలూ, మందిరాలూ, పాకశాలలూ, గుర్రపుశాలలూ గల ఒక కోట నిర్మించాడు. రాజ కుటుంబీకులు నివసించడానికి ఉద్దేశింపబడిన భవనంలో సుందరోద్యానాలు పెక్కింటిని నాటించాడు. పెద్ద పెద్ద స్తంభాలూ, ఆర్చిలతో జిలుగు పని చాలా చేయించాడు. యమునానది నుంచి పెద్ద కాలవ ద్వారా నీటిని కోటలోనికి తీసుకువచ్చి అక్కడ జలధారా యంత్రాలను ఏర్పాటుచేశాడు. ఢిల్లీలోని జుమ్మా మసీదూ, ఆగ్రాలోని జుమా మసీదూ 1644-58 మధ్య నిర్మింపబడ్డాయి. షాజహాన్ చక్రవర్తి పేరు చెప్పినప్పుడు మనకు తప్పకుండా జ్ఞాపకంవచ్చేది తాజ్‌మహల్. మరణించినవారి సంస్మరణార్థం ఇంత సుందరమయిన భవనం ప్రపంచం మొత్తంమీద ఎవ్వరూ ఎక్కడా నిర్మించలేదన్న మాట అక్షరాలా నిజం. బ్రతికిఉన్న రోజులలో ముంతాజ్ బేగమ్ ఆ కాలంలో అత్యంత సుందరమయిన ఖాస్ మహల్‌లో నివసిస్తూఉండేది. మరణాంతరం అతిలోకరమణీయమయిన తావులో చిర విశ్రాంతి పొందింది. షా జహాన్ చక్రవర్తి సౌందర్యాభినివేశానికి, నిర్మాణ నైపుణ్యానికీ, తాజ్ మహల్ అమర చిహ్నం.

భారతదేశం నలుమూలలనుంచే కాకుండా బాగ్దాద్, బుఖారా, షిరాజ్, సమర్కండ్ పట్టణాలనుంచి శిల్పులను ఆహ్వానించి తీసుకువచ్చారు. నిర్మాణం ప్రారంభంకాకముందే ప్రతి అంగుళాన్నీ ఎలా అలంకరించాలో ముందుగా వివరా

లన్నీ సిద్ధపరచుకొని ఆ తరవాత యమునానదిఒడ్డున చక్కని చోట తోటవేసి దాని మధ్య తాజ్‌మహల్‌ను నిర్మించారు.



తాజ్ మహల్ : అగ్రా

తాజ్‌మహల్ అందంలో దాని కదే సాటి. నిజానికి మానవుడూ, ప్రకృతీ పరస్పరం సహకరించి పరమ సౌందర్యనిధానాన్ని భావి సంతతులవారికి బహూకరించి నట్లు కనిపిస్తుంది. ఔరంగజేబ్ చక్రవర్తికూడా కొన్ని కొన్ని పెద్ద భవనాలు కట్టించాడు. కాని వెనుకటి వాటితో పోల్చి చూచినప్పుడు అవి అంతగా గణనలోకి రావు. అయితే ఔరంగాబాద్‌లో ఔరంగజేబ్ చక్రవర్తి తన భార్యకోసం నిర్మించిన సమాధి తాజ్‌మహల్‌కు ఒక నాసిరకం నకలుగా తయారయింది. మొఃగలుశిల్ప సాంప్రదాయానికి భిన్నమైన శిల్ప సాంప్రదాయం బిజా

పూర్‌లో వర్ధిల్లింది. ఈ స్వతంత్ర సాంప్రదాయాన్ని ప్రవర్తిల్లజేసినవారు బిజాపూర్‌ను పరిపాలించిన ఆదిల్‌షా వంశస్థులు. వీరు నిర్మించిన గోల్‌గుంబజ్, మహమ్మద్ ఆదిల్‌షా గోరీ చాలా గొప్ప కట్టడాలు. వీరు నిర్మించిన మరొక గొప్ప కట్టడం ఇబ్రహీమ్ రౌజా. దీనిలో రెండవఇబ్రహీమ్ ఆదిల్‌షా సమాధీ, ఒక మసీదూ ఉన్నాయి ఈ. రెండింటి శిల్పములూ విలక్షణమై చూడముచ్చటగా వుంటాయి.

18 వ శతాబ్దిలో మొగలాయి సామ్రాజ్యం పతనం అయిన తరవాత రాజపోషణ లేక భారతీయ శిల్పశాస్త్రం చాలా దెబ్బతిన్నది. కాని రాజపుత్ర రాజులు బ్రహ్మాండమయిన భవనాలు నిర్మింపజేసి భారతీయ శిల్ప ప్రతిభ శిథిలమైపోకుండా కాపాడారని చెప్పాలి.

ఈ సందర్భంలో జయపూర్‌లోని హవా మహలును, ఉదయపూర్‌లోని మహారాణా ప్రాసాదాన్నీ చెప్పుకోవాలి. అయోధ్యనవాబులుకూడా అనేక స్మారకమందిరాలు నిర్మించారు. కాని వీటి శిల్పవైభవం అంతగా చెప్పుకోదగింది కాదు. 18–19 శతాబ్దాలమధ్య కాశీపట్టణంలో పెక్కు ఘట్టాలు నిర్మించబడ్డాయి. దూరంనుంచి చూడడానికి గంగ ఒడ్డున గల కాశీ ఘట్టాల దృశ్యాలు మనోజ్ఞంగా కానవస్తాయి. 19 వ శతాబ్దం చివరి పాదంలోనూ, 20వ శతాబ్దం మొదటి అర్ధభాగంలోనూ చాలా భవనాలూ, దేవాలయాలూ నిర్మింపబడ్డాయి. కాని ఇవన్నీ ఇంతవరకూ పేర్కొన్న సాంప్రదాయాలలోనే నిర్మింపబడడంచేత వాటిని

గురించి ప్రత్యేకంగా చెప్పడానికి ఏమీలేదు. అయితే శిల్ప వైభవంలో మాత్రం ఇవి పాతవాటికి చాలా,లొక్కు.

ఇళ్ళూ గుళ్ళూ పేరుచెప్పి పాఠకులను ఉత్తరధ్రువం నుంచి దక్షిణధ్రువంవరకూ, సేన్ ఫ్రాన్సిస్కోనుంచి షాంగ్హై వరకు తిప్పి ఆ పర్యటనక్రమంలో ఎస్కిమోలు, లనూ, ఇటాలియన్ రైతుల 'బీహైవ్' ల ఆదిమవాసులకు ఆశ్రయభూతాలయిన కొండగుహ పూరిళ్ళనూ, పటకుటీరాలనూ, సరోవర భవ మంచె ఇళ్ళనూ, వృక్షాగ్రవసతులనూ—ఒకటేమిటి భూమండలంలో ఆయాప్రాంతాల పరిస్థితులకూ, సాం యాలకూ, నైసర్గిక విశేషాలకూ తగినట్లుగా తమతమ స్తోమతను అనుసరించి ప్రజలు ఎన్నెన్నిరకాలఇళ్ళు నిర్మించు కుంటారో వాటినన్నిటినీ రేఖామాత్రంగానైనా పరిచయ చేశాము. అలాగే ఐదువేల సంవత్సరాలకు పూర్వంనుం కి నేటివరకూ భారతీయశిల్పం ఏవిధంగా వర్ధిల్లిందో వివ ప్రయత్నంలో మహెంజొదారో శిధిలాలనుంచి బయల చి దీసి, యావద్భారతాన్నీ పర్యటింపజేసి హిందూ దేవాలయా లనూ, అజంతా వగైరా బౌద్ధక్షేత్రాలనూ, తాజ్మహ వగైరా దివ్యసుందరభవనాలరూపంలో వ్యక్తమయిన ముస్లి శిల్పవైభవాన్నీ పరిచయంచేశాము. ప్రతివారూ ఇల్లుకట్టు కొని పెళ్ళిచేసుకొని ప్రతిరోజూ గుడికివెడుతూ ఆయురా రోగ్య ఐశ్వర్యాలతో కలకాలం అభ్యుదయపథంలో పురోగ మించాలని మా కాంక్ష.